LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.zaminryot.com "e-mail : editor@zaminryot.com"

# జమీన్‌రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు  సంపుటి : 71  సంచిక : 39  29.9.2000 శుక్రవారం  12 పేజీలు  విడిప్రతి : రూ.2.00లు  జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

## మళ్లీ ఖజానా ఖాళీ!

# వేల కోట్ల అప్పు ఏమైపోయింది?

రాష్ట్ర ఖజానా మరొకసారి దివాలా అంచుకు చేరింది. రేపు 1తేది చెల్లించ వలసిన జీతాలకు ప్రభుత్వం వద్ద డబ్బు లేదు. దాదాపు 160 కోట్ల రూపాయలు, అత్యవసర సమయాలలో మాత్రమే వాడవలసిన వేస్ అండ్ మీన్స్ పద్దు క్రింద ఓవర్ డ్రాఫ్ట్‌గా తీసుకొని పరువు దక్కించుకోబోతున్నారు. చంద్రబాబు ముఖ్యమంత్రి అయిన తర్వాత ఈ పరిస్థితి ఏర్పడడం ఇప్పటికి ఎన్నిసార్లో గుర్తు లేదు. పరమ దరిద్రగొట్టు రాష్ట్రాలైన బీహార్, ఒరిస్సాలు కూడా ఇంత దివాలా స్థితికి చేరుకోవడం లేదు. ఆంధ్రప్రదేశ్ మాత్రమే ఏడాదికొకసారైనా ఖజానా ఖాళీ అన్పించుకొంటున్నది.

ఎందువల్ల ఈ అవమానకర దుస్థితి? పన్నుల రూపేణా వచ్చే వేల కోట్ల రూపాయలు ఏమౌతున్నాయి? ప్రపంచ బ్యాంకు ఇచ్చే వందలాది మిలియన్ డాలర్లు ఎటు పోతున్నాయి? కేంద్ర ప్రభుత్వ గ్రాంట్లు ఏ దారికి మళ్లుతున్నాయి? రాష్ట్రం ఏ దిశలో నడుస్తున్నది?

పోనీ అభివృద్ధి కార్యక్రమాల కోసం విపరీతంగా వ్యయం చేస్తున్నందు వల్ల ఇబ్బంది ఎదురౌతున్నాయా అంటే అదీ లేదు. గత ఆరేళ్ల కాలంలో రాష్ట్ర ప్రభుత్వం ఒక్క నీటిపారుదల పథకానికి చిల్లిగవ్వ వ్యయం చేయలేదు; ఒక్క కొత్త విద్యుత్ కర్మాగారం నిర్మించలేదు; ఒక్క మెడికల్ కాలేజి తెరవలేదు; ఒక్క ఆస్పత్రి నిర్మించలేదు; చివరికి నూతన ప్రాథమిక పాఠశాలలూ ప్రారంభించలేదు. గత రెండేళ్ల నుంచి అయితే సాధారణ రోడ్ల మరమ్మత్తులు, ఆస్పత్రులకు మందులు ఆఫీసులకు తెల్లకాగితాలు సైతం నిల్పివేశారు. జీరో బేస్‌డ్ బడ్జెట్ పేరుతో ఎక్కడి కార్యక్రమాలు అక్కడ స్తంభింపజేశారు. చివరకు ఎమ్మెల్యేల జీతాలకు కూడా బడ్జెట్ లేదు. ప్రజలను, ప్రగతిని ఇంతగా ఆటంకపరచి, దాచి వుంచిన డబ్బు ఏమైపోయింది?

### కొత్త ప్రాజెక్టులు లేవు, రోడ్లకు రిపేర్లు నిల్, వచ్చే నిధులన్నీ ఏమైనట్లో?

ప్రభుత్వంలో ఏదో తెలియని మోసం జరుగుతూందని సందేహిం చవలసిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఆ మధ్య "కాగ్" కంట్రోలరు విద్యుత్ సంస్థ లెక్కలు పరిశీలించి చూస్తే రెండు వందల కోట్ల రూపాయలు ప్రైవేట్ వ్యక్తులకు అక్రమంగా, అదనంగా చెల్లించినట్లు బయటపడింది. ఇంకెన్ని శాఖలు, ఇంకెన్ని పద్దుల్లో ఇంకెన్ని వేల కోట్ల రూపాయలు ఇట్లా ప్రభుత్వ ఖజానా నుంచి ప్రైవేట్ వ్యక్తుల జేబులలోకి తరలి వెళ్తున్నాయి అన్న అనుమానం కల్గడంలో ఆశ్చర్యం లేదు. ఆ దోపిడీ జరగకుంటే ఉద్యోగులకు జీతాలు చెల్లించలేని దుస్థితి ఎందుకు వస్తుంది?

ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు తన అవకతవక విధానాలతో రాష్ట్రాన్ని నాశనం చేస్తున్నాడు. కంప్యూటర్లు, ఎలక్ట్రానిక్ గవర్నమెంట్ అంటూ ప్రజలను, ప్రపంచాన్ని తప్పుదారి పట్టించి ప్రభుత్వ వ్యవస్థను చిందరవందర చేస్తున్నాడు. ఇప్పటికైనా ఆయన తన తప్పులు సరిదిద్దుకొని ప్రజలకు జవాబుదారీగా వుండడం మంచిది. ఆయన్ను ఆ వేరు సరిదిద్దకుంటే రాష్ట్ర భవిష్యత్ ఘోరంగా తయారౌతుంది. నిధుల విషయంలో, ప్రపంచ బ్యాంకు షరతుల విషయంలో ఆయన ఎంత మోసానికి పాల్పడింది చూశాం; ఇంక ఎంత మాత్రం ఆయన అబద్ధాలు నమ్మలేం. ఆయన నుంచి నిజాలు చెప్పించడానికి ప్రజలు ఉద్యమించవలసిన సమయమిదే! *

# మ్యాన్‌ఆఫ్‌ది ఇయర్ శాంతా వరప్రసాద్

నెల్లూరీయుడు - వరప్రసాద్‌రెడ్డి ఒక అరుదైన అవార్డు అందుకున్నాడు. ఫార్మాస్యూటికల్ రంగంలో "ఎంటర్ ప్రెన్యూర్ ఆఫ్‌ది ఇయర్" సత్కారం లభించింది ఆయనకు. "ఎర్నస్ట్ అండ్ యంగ్" అనే బహుళజాతి సంస్థ దేశవ్యాప్తంగా వుండే పారిశ్రామికు లందరినీ అధ్యయనం చేసి, ఎంపిక చేసే అవార్డు ఇది. భారతీయ పారిశ్రా మిక రంగంలో దీనికి చాలా విలువ గౌరవం వున్నాయి. ఈ ఏడాది ఎంటర్ ప్రెన్యూర్ ఆఫ్‌ది ఇయర్ అవార్డుకు తొలి జాబితాగా ఇరవై పేర్లు నిర్ణయిం చారు. రిలయన్స్ ముఖేష్ అంబాని, ఎయిర్‌టెల్ సునీల్ మిట్టల్, ఇన్ఫోసిస్ నారాయణమూర్తి, విప్రో అజీత్ ప్రేమ్‌జీ, అరవిందో లాబరేటరీస్ రామ్‌ప్రసాద్‌రెడ్డి, సత్యం రామలింగ రాజు, టాటా, బిర్లా కుటుంబ సభ్యు లతో కూడిన జాబితా ఇది. ఒక కమిటీ వీరిలో నుంచి ఎంటర్‌ప్రెన్యూర్ ఆఫ్‌ది ఇయర్‌గా ముఖేష్ అంబానిని ఎంపిక చేసింది; ఫార్మాస్యూటికల్ రంగంలో వరప్రసాద్‌రెడ్డి గెల్చుకున్నాడు.

వరప్రసాద్‌రెడ్డి కేవలం స్వయం కృషితో పైకి వచ్చిన పారిశ్రామికుడు. వెనుక, ముందు ఎటువంటి అండ, సహకారం లేదు; ఆర్థిక పరిస్థితి - మధ్య తరగతి రైతు కుటుంబం; అను భవం శూన్యం; పరిశ్రమలు, వ్యాపార రంగాలలోని వారెవరూ బంధువులు కాదు, చేరదియ్యలేదు. ఎపిఐడిసిలో చిరు అధికారిగా జీవితం ప్రారంభించి; హైదరాబాద్ బ్యాటరీస్‌లో చిన్న భాగస్వామిగా పరిశ్రమల రంగంలో కాలు పెట్టి, శాటిలైఫ్ కంపెనీలో ఆటు పోట్లు ఎదుర్కొని, చివరగా స్నేహితుల ప్రోత్సాహంతో "శాంతా బయోటెక్" కంపెనీ తెరిచారు. రిలయన్స్, ఎయిర్ టెల్ వంటి వాటితో పోలిస్తే అది చాలా చాలా చిన్నది. రిలయన్స్ పెట్రోకెమికల్స్ ప్రాజెక్ట్ పెట్టుబడి 30వేల కోట్ల రూపాయలు;

తారువ 6వ పేజీలో

# జమీందార్లపై పోరుకు 'దూపాడులో' శ్రీకారం!

తొలి కలెక్టర్ ట్రావెర్స్ బదలీ తర్వాత, కొత్త కలెక్టర్‌గా నెల్లూరుకు వచ్చిన ఫ్రేజర్ - 1809 నుంచి 23వరకు సుదీర్ఘ కాలం పనిచేశాడు. అతను వచ్చేటప్పటికే పాత కలెక్టర్ చేసిన భూమిశిస్తు వసూలు ప్రయోగాలు వికటించి నెల్లూరు జిల్లా గ్రామాల్లో అశాంతి ఏర్పడి వుండింది. దానితో ఫ్రేజర్ తన ఆలోచనలకు తగినట్లు - తీన్‌సాల్ మక్తా విధానం ప్రవేశపెట్టాడు. అయితే అది విఫలమైంది. వెంటనే - ఆరేండ్ల శిస్తు పద్ధతి ప్రారంభించాడు. ఆరు నెలలు తిరగక మునుపే అది ఆచరణ సాధ్యం కాదని తేలిపోయింది. దానితో అంతకు క్రితం పదకొండేళ్లలో ఏ ఏ గ్రామంలో ఎంతెంత శిస్తు వసూలైందీ లెక్క తీసి - పదేండ్ల శిస్తు పద్ధతి ప్రకటించాడు. ఈ మార్పులు

## భూమి శిస్తు దండకంలో గందరగోళం

రైతులకు అంగీకారం కాలేదు. దానికి తోడు ఒక ప్రక్క కరవు. ఇంకొక ప్రక్క తుఫాన్లు రావడంతో రైతులు శిస్తు చెల్లించలేక పోయారు. బాకీలు పెరిగి పోయాయి.

### పుట్టికాట్

ఈ సమస్యను అధిగమించడానికి 1818లో కలెక్టర్ ఫ్రేజర్ పుట్టికాట్ అనే నూతన శిస్తు విధానం ప్రకటించాడు. ఈ పద్ధతి క్రింద గ్రామం మొత్తం శిస్తు లెక్కకట్టి దానిని గ్రామంలోని రైతు కమతాల మధ్య పంపకం చేస్తారు. అయినా రైతు కమతాలు కొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి కావడంతో ఏ రైతు ఎంత చెల్లించాలి అన్న సమస్య తలెత్తింది. ఈ పద్ధతి అమలు సాధ్యం కాలేదు.

### కలెక్టర్ స్మాలే

పద్నాలుగేళ్లపాటు రకరకాల ప్రయోగాలు చేసి; ఏ ఒక్క ప్రయోగానికి రైతుల అంగీకారం పొందలేక పోయిన కలెక్టర్ ఫ్రేజర్ 1823లో బదలీ అయ్యారు. ఆయన స్థానంలో స్మాలే అనే అధికారి కలెక్టర్‌గా వచ్చాడు. భూమి శిస్తు దండకంలోని గందరగోళం నివారించడానికి భూమి వివరాలు సమగ్రంగా సర్వే చేయడమే మార్గమని స్మాలే ప్రభుత్వానికి నివేదిక పంపాడు. ప్రభుత్వం అందుకు అంగీకరించింది. ప్రయోగాత్మకంగా మొదట పంచేడు గ్రామంలో సర్వే జరిగింది. ఆ తర్వాత జిల్లాలోని అన్ని గ్రామాలలో సర్వే చేశారు. సర్వేలో వివరాలు సేకరింపబడిన గ్రామాలన్నిటిలో రైత్వారీ మక్తా సెటిల్‌మెంట్ పద్ధతి ప్రవేశపెట్టి (1826), దాని ప్రకారం శిస్తు వసూలు ప్రారంభించాడు.

నెల్లూరు జిల్లా పుట్టుపూర్వోత్తరాలు - 17



డాక్టర్ సి.వి. రామచంద్రరావు

ఆ పద్ధతి ఫలితం ఏమిటన్నది అర్థమయ్యే లోపలే - 1830లో స్మాలేకు నెల్లూరు నుంచి బదలీ వచ్చింది.

ఈ విధంగా 1801 - 1830 సంవత్సరాల మధ్యలో కలెక్టర్లు రైతులతో ఆటలాడారు. రైత్వారీ సెటిల్‌మెంట్, బారాఫసలీ పైమాష్ మక్తా పుల్లరి, ఏలేబ్ రెంట్స్, సాంవత్సరిక రైత్వారీ, పుట్టికాట్ రైత్వారీ, పర్మినెంట్ సెటిల్‌మెంట్, సెక్సెన్యువల్ రెంట్స్, డెసెన్నియల్ రెంట్స్, రైత్వారీ ఫీల్డ్ అసెస్‌మెంట్స్... ఇట్లా రకరకాల పద్ధతులు ప్రవేశపెట్టారు. ఒక కలెక్టర్ ప్రారంభించిన విధానం మరొక కలెక్టర్‌కు అర్థమయ్యేది కాదు; ఫలితంగా ఈ విధానాల మధ్య పొంతనలేక, తరచు మార్పులకు గురయ్యాయి. కలెక్టర్‌ల లక్ష్యం ఒక్కటే - కంపెనీ ప్రభుత్వానికి ఎక్కువ శిస్తు రాబడి రాబట్టడం! వీరి ప్రయోగాల మధ్య రైతులు నలిగిపోయారు; అయోమయానికి గురయ్యారు.

### జమీందారీల దోపిడీ

ఇంకొక ప్రక్క జమీందార్ల పాలనలో వుండిన గ్రామాలలో పరిస్థితి మరీ దౌర్భాగ్యంగా వుండేది. అప్పటి కలెక్టర్లకే జమీందారీల దోపిడీ అన్యాయంగా కన్పించింది. వెంకటగిరి జమీందార్ల దుర్మార్గాల గురించి, వారి పాలనలోని దోషాల గురించి కలెక్టర్లు తమ కంపెనీ ప్రభుత్వానికి తరచు నివేదికలు పంపేవారు.

జమీందారి గ్రామాలలో ప్రజలు జమీందారుకు బానిసల క్రింద లెక్క. జమీందారు ఏది చెప్తే అదే న్యాయం,

## ప్రయోగాలతో రైతులు నలిగిపోయారు

అదే శాసనం. భూమి మీద రైతులకు ఎటువంటి హక్కు లేదు. పాలెగాళ్లు, ఇనాందారులు రైతులను రకరకాలుగా పీడించేవారు. జమీందారు పట్టాభిషేకం సమయంలో రైతులు నజరానాలు చెల్లించవలసి వచ్చేది. అది రైతుల కొంప గుల్లచేసే స్థాయిలో వుండేది. జమీందారీల అరాచకత్వానికి నిరసనగా మొట్టమొదట సారిగా దూపాడు గ్రామంలో రైతులు అలజడి చేశారు.

ఈ సంఘటనలో కలెక్టర్‌లు ప్రభుత్వానికి నివేదిక పంపుతూ - జమీందారీల క్రింద వున్న ఇనామ్‌దారులందరినీ రద్దు చేసి, ప్రభుత్వమే ఆ భూములు స్వాధీనం చేసుకోవాలని; జమీందారుల అరాచకాలను ప్రతిఘటించాలని; జమీందారులపై తమకు పర్యవేక్షక అధికారం; అక్కడ తమ రక్షక భట వ్యవస్థ వుండాలని ప్రభుత్వానికి సిఫార్సు చేశారు.



# సణుగుడు

* జిల్లా కాంగ్రెస్ సంక్షోభంలో కూరుకపోతూంది!

* ధన్యజీవి రంగారెడ్డి !

నెల్లూరు జిల్లాలో కాంగ్రెస్ పార్టీ చుక్కానిలేని నావవలె తయారౌతున్నదా అన్పిస్తూంది! రాజు లేని రాజ్యం వలె మారిపోతున్నదా అన్న సందేహం కల్గుతూంది!

తిరుపతి సత్యాగ్రహంలో నెల్లూరు నుంచి హాజరైంది - కాంగ్రెస్ నాయకులు మాత్రమే; కార్యకర్తలను, జనంలోని పార్టీ సానుభూతిపరులను పిల్చినవారు లేరు, పట్టించుకొన్న వారూ లేరు. జిల్లాలో వున్న పరిస్థితికి ఈ ఒక్క ఉదాహరణ చాలు. గత అసెంబ్లీలో నెల్లూరు నుంచి ఒక్క ఎమ్మెల్యే కూడా లేదు; అందరూ తి.తా.లే కానీ అప్పుడు పార్టీ అద్భుతంగా పనిచేసింది. కాంగ్రెస్ స్వర్ణోత్సవాలు జరిపితే నెల్లూరు పట్టణం పట్టలేదు - జనంతో! తిరుపతికి సోనియాగాంధీ వస్తే వందల్లో వెళ్లాయి బస్సులు, లారీలు! ఇప్పుడు ఒకరికి నలుగురు ఎమ్మెల్యేలు గెల్చారు; కరెంట్ ఉద్యమం మాత్రం అత్యంత నీరసం; తిరుపతి సత్యాగ్రహానికి, ఒక్క వెంకటగిరి, సూళ్లూరుపేటల నుంచి తప్ప జనం కదలలేదు. కదలలేదనడం కంటే, కదిలించ లేదనడం నిజం. రాజకీయపార్టీల సభలకు వాహనాలు ఏర్పాటు చేయనిదే జన సమీకరణ సాధ్యం కాదు కదా?

కాంగ్రెస్ సంక్షోభంలో పడిపోయిందని - కేవలం తిరుపతి ఘటన నుద్దేశించి చెప్పడం లేదు. గత ఆరు నెలలుగా ఇటువంటి సంఘటనల పరంపరను చూసి అంత పెద్ద వ్యాఖ్య చేయవలసి వస్తూంది. జిల్లా పార్టీని ప్రధానంగా పీడిస్తున్న జబ్బు - అమ్మ పెట్టదు, అడుక్కతిన్నివ్వదు - అన్న ధోరణి. ఒక్కొక్క నియోజకవర్గానికి ఒక్కొక్క నేత; అందరి వైఖరీ ఒకే తీరు - నా బంగారు పుట్టలో వేలుపెడితే కుట్టనా! తమ రాజ్యంలో మరొక యువ రాజు లేదా సామంతురాజు ఎదగడం వీరికి సహ్యం కాదు. ఇరవై ఏళ్లు ఎమ్మెల్యేగా అధికారం అనుభవించిన యానాది రెడ్డి కాని, ఇరవై వారాల క్రితం ఆ ముచ్చటం తీర్చుకున్న ఆనం వివేకానంద రెడ్డి కాని - మూతులు ఒక్కటే! ఒక్క కోవూరులో మినహా పార్టీకి గ్రూపులు లేవు; వున్నా లెక్కలోనికి రావు. తమ స్వంత అవసరాలు వచ్చినప్పుడు ఎవరికి వారు వీరాధివీరులు; జనాన్ని సమీకరిస్తారు, సభలు జరుపుతారు, బల ప్రదర్శనలు చేస్తారు! పార్టీ సమిష్టి కార్యక్రమాలకు మాత్రం ముఖాలు చాటు చేస్తారు.

సి.వి. శేషారెడ్డిది సర్వేపల్లి సామ్రాజ్యం పైగా డిసిసి ముళ్లకిరీటధారి! ఇంకొక కాంగ్రెస్‌వాది తన గ్రామాలలో తిరిగినట్లు తెలిస్తే వంటికి దురదకుందాకు రాసినట్లు ఫీలైపోతాడు. పసల పెంచలయ్యకి వయస్సు పైబడింది, వ్యాపారాలు పెరిగిపోయాయి; ఏ మాత్రం ఓపిక లేకున్నాసరే - తన పుట్టలో వేరొకడు వేలు పెట్టడానికి వీల్లేదని శాసిస్తాడు. వెంకటగిరి జమీందారీ పరిధిలో రాజ్యలక్ష్మమ్మగారికి ఆ పేచీయే లేదు; అక్కడకు వెళ్లి తొంగిచూడడానికి కూడా ఎవరూ లేరు. గూడూరు - ఎవరికి పుట్టిన బిడ్డవురా వెక్కి వెక్కి ఏడ్చేవు అన్నంత అనాధ అయిపోయింది. ఎల్లసిరి గోపాల రెడ్డికి "మగ" మనుషుల పొడగిట్టదు; తాను ఇల్లు కదలడు, ఇంకొకరిని కదల నివ్వడు!

రాపూరు రామనారాయణరెడ్డికి అదొక లోకం! లేస్తే మనిషి కాదనే తత్వం! మాట చెప్పినా, పనికి పూనుకున్నా కట్టుబాటు వుంటుంది; కాని ఆ ముత్యాలు ఎప్పుడు రాలుతాయన్నది చెప్పలేము. వెంకటగిరి వలెనే ఇక్కడా ఎగిరిపడే ఏలికపాములు ఏమీ లేవు. నెల్లూరుటౌన్‌లో వివేకానందరెడ్డి పోకడ, వానరాకడ ఆ దేముడు పసిగట్టవలసిందే - మానవ మాత్రులకు సాధ్యం కాదు. మనసు ఖుషీగా వుంటే వీధి స్థాయి పిల్లకాయలనూ వేదికెక్కించి వినోదిస్తాడు; బుర్రలో పురుగు దొలిస్తే ఎంత పెద్దవాడినైనా నువ్వెవ్వడివని ప్రశ్నిస్తాడు. కోవూరులో విచిత్రమైన పరిస్థితి. ఒకటికి మూడుసార్లు టిక్కెట్ ఇచ్చినా గెలవలేకపోయిన తన దురదృష్టానికి - మొన్న మళ్లీ టిక్కెట్ ఇవ్వనివారిని నిందిస్తూ పార్టీని పట్టించు కోవడం దేవకుమార్‌రెడ్డి మానేశాడు; కష్టపడి టిక్కెట్ తెచ్చుకున్నా తనను ఓడించారని జనం మీద అలిగి

## డోలేంద్ర

జెక.రెడ్డి దూరం జరిగిపోయాడు. రెండింటికీ చెడిన రేవడి అయిపోయింది కోవూరులో కాంగ్రెస్ పార్టీ. అల్లూరులో విష్ణువర్ధనరెడ్డిది కడుపు చించుకొంటే కాళ్లమీద పడుతుందనే బాధ. తనను ఇంటికి పరిమితం చేసిన తెలుగుదేశం ఆదాల ప్రభాకరరెడ్డి ఇల్లు ఎప్పుడూ జిల్లా కాంగ్రెస్‌వాదుల సంపర్కంతో కళకళలాడు తుండడంతో బిక్కచచ్చిపోయి వున్నాడు విష్ణు. ఉదయగిరిలో "శత్రు శేషం" తనంతట తానుగానే అదృశ్యమైపోయింది. మేకపాటి శేఖరరెడ్డికి పేచీయే లేదు.

కావలిలో యానాదిరెడ్డి గారిని మాత్రం పాలుపోసి పెంచిన పాము కాటేస్తున్నది. 1972లో సమితి అధ్యక్షునిగా గెల్చినప్పటి నుంచి, మొన్న అసెంబ్లీ ఎన్నికలలో ఓడిపోయే వరకు మూడు దశాబ్దాల పాటు మర్రిచెట్టు వలె బ్రతికాడు. వానప్రస్థాశ్రమం స్వీకరించే సమయంలో, ఆలోచించి, ఆలోచించి గ్రంథియానాదిశెట్టిని వారసుడిగా జనానికి చూపితే - ఔరంగజేబు, షాజహాన్‌ల కథ కళ్లకు కట్టింది. యానాదిశెట్టి తొలి ఛాన్స్‌లోనే గురువుకు పంగనామం పెట్టాడు. మర్రిచెట్టు క్రింద మొలకను మొలవనిస్తే మర్రిచెట్టు ప్రమాదంలో పడిపోవడం లోక విరుద్ధమైనా కావలిలో మాత్రం నిజం.

గాంధారి కడుపులో పిండంవలె జిల్లాలో పార్టీ పదకొండు ముక్కలుగా ఛిద్రమై పోయింది. ఏడాది క్రితం వరకు సారా చెంబుత్రాడు నేదురుమల్లి జనార్దనరెడ్డి చేతిలో వుండేది; తోలు బొమ్మలాటలో వలె వెనుక నుంచి వేళ్లు కదిలిస్తే తెరపై ఈ పదకొండు బొమ్మలూ ఆడేవి. ఇప్పుడాయన తాళ్లు వదిలేశాడు.

తరువా 7వ పేజీలో

# రైతు గతి దుర్గతేనా?

అనంతపురం జిల్లా నుంచి హృదయం ద్రవింపజేసే వార్తలు విన్పిస్తున్నాయి. అన్నదాతలు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు; అప్పుల వూబిలో కూరుకపోయిన తమ కుటుంబాలను గట్టెక్కించే దారి కన్పించక ఆత్మహత్యలే శరణ్యం అనుకొంటున్నారు. కుటుంబ పెద్దలే కాదు - కుటుంబ సభ్యులూ జీవితంపై విరక్తి చెంది జీవనం పరిసమాప్తం చేసుకోవాలనే నిర్ణయానికి వస్తుండడం మరీ ఒళ్లు జలదరింపజేసే పరిణామం. ఒక రైతు కుటుంబంలో ఇద్దరు ఆడపిల్లలు తనువు చాలించారు. ఆదాయం కోల్పోయి, అప్పుల పాలైన తమ తండ్రి, తమకు పెళ్లిళ్లు చేయలేరని; అది తమ కుటుంబాన్ని మానసిక క్షోభకు గురిచేస్తుందని భయపడి పురుగుల మందు త్రాగేశారు వారు. ఈ పురుగుల మందు ప్రభుత్వం ఉచితంగా సరఫరా చేసింది కావడం గమనార్హం.

అనంతపురం రైతులకు, గ్రామీణ కుటుంబాలకు - కష్టాలు, కన్నీళ్లు కొత్త కాదు. వారి జీవన విధానంలో అదొక అంతర్భాగం. రెండేళ్లకొకసారి క్రమం తప్పకుండా కరవు రావడం; పంటలు మాడిపోయి, పెట్టుబడి హరించుకొని పోవడం; మళ్లీ పైరు పెట్టుకోవడానికి అప్పులు చేయడం; అవి తీరేంత వరకు కడుపు కాల్చుకొని, కోరికలు చంపుకొని అత్యంత దయనీయమైన జీవితాలు గడపడం వారికి అలవాటే. తినడానికి రెండు పూటలా తిండి గల్గిన వారు అదృష్టవంతుడిగా పరిగణింపబడే ఆకలి జిల్లా అది. అటువంటి శాపగ్రస్త బ్రతుకులు బ్రతకడం అలవాటై పోయినవారికీ భావిబ్రతుకు భయంకర దుస్స్వప్నంగా కన్పిస్తున్నదంటే - ఇక అక్కడి పరిస్థితి ఎంత ఘోరంగా తయారై వుందో వూహించుకోవచ్చు.

కరవుకు తోడు రైతును ఇంతగా కలవరపెడుతున్న సమస్య - వేరుసెనగపైరును నాశనం చేస్తున్న మొవ్వకుళ్లు తెగులు. ఇదొక వైరస్ క్రిమి; దానికి మందు లేదు. ఒకసారి మొక్కను పట్టుకొంటే వదలదు. పైగా దావానలం వలె వ్యాపించి, చుట్టుప్రక్కల కొన్ని కిలోమీటర్ల మేర ఒక్క మొక్క బ్రతకకుండా చేస్తుంది. అది వ్యాపించే వేగం, విధ్వంసక శక్తి అసాధారణమైనది. ఈ తెగులుతో అనంతపురం జిల్లా రైతులు చితికిపోయారు; వారి కుటుంబ ఆర్థిక పరిస్థితి ఛిద్రమైపోయింది; అప్పుల వూబిలో కూరుకపోయారు; రేపు అన్నదానిపై ఆశ అంతరించింది; ఏ దారీ కన్పించక వల్లకాటి దారి ఎంచుకొంటున్నారు.

గతంలో పత్తి పంట తెగుళ్ల బారిన పడి 156 మంది తెలంగాణా, గుంటూరు జిల్లారైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు; పల్నాడు ప్రాంత రైతులు కిడ్నీలు, ఇతర శరీర అవయవాలు అమ్ముకొంటున్నారు. ఇప్పుడు అనంతపురం రైతుల వంతు వచ్చింది. రేపు ఇంకెవరు బలికానున్నారో చెప్పలేము!

ఏమిటీ ఘోరం? ఎందుకింత దారుణం? ఎన్ని తరాలు మారినా, యుగాలు గడిచినా రైతు బ్రతుకులు ఇంతేనా? పాలకులు, ప్రభుత్వాలు ఏమి చేయలేరా? వ్యవసాయ పరిశోధనలు, వేల కోట్ల ప్రపంచ బ్యాంకు అప్పులు, కంప్యూటర్లు, శాటిలైట్లు రైతుల జీవితాలకు చేరువ కావడం ఎప్పటికీ సాధ్యం కాదా? ప్రపంచంలో ఏ అభివృద్ధి చెందిన దేశంలోనైనా రైతులను ఇంతగా నిర్లక్ష్యం చేస్తున్నారా? ఎక్కడుంది లోపం? ఎవరు చేసిన పాపం?

రైతుల చావుకు పంట నష్టం కారణం కాదని; అందుకు ఇతర ప్రేరణలు వున్నాయని; తెగుళ్లు సోకితే ప్రభుత్వం ఏమి చేయగలదని చెప్పి తప్పించుకొంటున్నారు ముఖ్యమంత్రి. మరణించిన రైతు కుటుంబాలకు ఆర్థిక సహాయం అందిస్తే - మరిన్ని ఆత్మహత్యలకు దారి తీస్తుందనే సాకు చూపించి, దాన్ని మానేశాడు. రైతుల కన్నీళ్లు తుడవడానికి తెగులు నివారణకు ఎంత మాత్రం పనికిరాని మోనోక్రోటోఫాస్ మందు సీసాలు మాత్రం పంచి పెట్టాడు; అవి - ఖర్చు లేకుండా చావడానికి మాత్రమే రైతుకు ఉపయోగపడుతున్నాయి.

**జమీన్‌రైతు**

ప్రభుత్వం చేయగల్గింది నిజంగానే ఏమీ లేదా? ఎందుకు లేదు? తెగులు ప్రారంభదశలోనే గుర్తించి మందు చల్లించి వుంటే ఇంత ప్రమాదం జరిగేది కాదు; తెగులు నిరోధక శక్తి కల్గిన విత్తనాలు సరఫరా చేసి వుంటే సమస్య తలెత్తేదే కాదు; పంట నష్టం జరిగినచోట భీమా సదుపాయాలు వర్తింపచేసినా, రైతుకు కనీసపాటి ఆర్థిక సహాయం అందించి, మళ్లీ పైరు పెట్టుకొనే వీలు కల్పించినా ఆత్మహత్యలు జరగవు! బిల్‌క్లింటన్ కారు మెత్తగా సాగిపోవడానికి హైదరాబాదు నగరంలో రోడ్ల మరమ్మత్తుకు వంద కోట్లు వెచ్చించగల్గిన రాష్ట్ర ప్రభుత్వం రైతులకు నష్ట పరిహారం చెల్లించడానికి మాత్రం ఖాళీ ఖజానా చూపు తున్నది! రైతును ఆదుకోవాలనే మనసు వుంటే - మార్గాలు బోలెడున్నాయి; ముఖ్యమంత్రికి కాని, ప్రభుత్వానికి కాని లేనిదల్లా చిత్తశుద్ధి మాత్రమే.

రైతు ఆర్థిక పరిస్థితి చితికిపోతే గ్రామీణ వ్యవస్థ ఛిన్నాభిన్నమౌతుంది; కూలీలకు పని, తిండి వుండవు. పేదరికం భయంకరంగా పెరిగిపోతుంది. అప్పుల భారంతో ఆత్మహత్యలు, ఆకలితో చావులు నివారించలేని ప్రభుత్వం - స్వర్ణాంధ్ర ప్రదేశ్ గురించి పలవరించడం పిచ్చితనం. రైతులు అప్పు చేసేది విలాసాలకు వినోదాలకు కాదు పెళ్లాం పుస్తెలు తాకట్టుపెట్టి పస్తులు తప్పించుకొనే పేదరైతు అప్పులకీ, ఆత్మహత్యలకు పెడార్థాలు తీసి, రాష్ట్ర ప్రభుత్వం తన బాధ్యత తప్పించుకోజూడడం ఘోరమైన నేరం. చంద్రబాబు నాయుడు తన కంప్యూటర్ క్రీడ ప్రక్కనపెట్టి, తక్షణం రైతులను ఆదుకోవడానికి చర్యలు చేపట్టాలి.

* * *

---

**జమీన్‌రైతు**

22.9.50

వెల: 0-3-0 పేజీలు: 12

## నాసిక్ కాంగ్రెస్ నాయకత్వం నాసిక్ ప్రాధాన్యం

జయపూర్ కాంగ్రెస్ జరిగిన 21 మాసాలకు నాసిక్ కాంగ్రెస్ జరిగింది. జయపూర్ సమావేశంలో వున్నంత వుత్సాహం నాసిక్‌కు లేదుగాని, జయపూర్ కంటె ఎక్కువ ప్రాధాన్యము, ఎక్కువ ఆందోళన కలిగించేదిగానే నాసిక్ సమావేశం సంభవించింది.

స్వతంత్ర భారతదేశంలో జరిగిన ప్రప్రథమ సమావేశంగా జయపూర్ వుత్సాహతిశయాన్ని రెచ్చిస్తే, దేశంలో సాధారణ ఎన్నికల ముందు జరిగిన చివరి సమావేశంగా ప్రాముఖ్యత వహించి, రాష్ట్రపతి ఎన్నికలో అగ్రనాయకుల మధ్య వచ్చిన విభేదాలు స్థిరీకరింపబడుటకు దోహదమివ్వవచ్చుననే ఆందోళనతో నాసిక్ కాంగ్రెస్ నెరవేరింది.

కాని శ్రీరామచంద్రుని ఆవాసంతో పునీతమైన ఈ పుణ్యక్షేత్రం, దుష్టురాలైన శూర్పణఖకు లక్ష్మణుని చే తగిన ప్రాయశ్చిత్తం జరిగిన ఈ పవిత్ర ప్రదేశమైన నాసిక్‌లో జరిగిన ఈ కాంగ్రెస్, నితివాహ్యులైన కాంగ్రెస్ వారలకు బుద్ధి చెప్పి, రుజుమార్గ వర్తనులైన ప్రజాసేవాతత్పరులకు ప్రోత్సాహమిచ్చి, కొన్ని సంవత్సరాల వరకు భారత భవిష్యత్తు రూపు రేఖలు దిద్దగల అత్యంత ముఖ్య నిర్ణయములు చేయగలరని ఆశించారు. కానీ ఈ ఆశలన్నీ అడియాసలైనవి. కాంగ్రెస్‌లోని కలుషక్షాళనా ప్రయత్నం జరుగలేదు. ఇది ఒక నిత్యకృత్య వ్యవహారంగా జరిగిపోయింది.

### సినిమాలను గూర్చి టాండన్ అభిభాషణ

నాసిక్ కాంగ్రెస్ అధ్యక్షోప




న్యాసంలో శ్రీ పురుషోత్తమదాస్ టాండన్‌గారు ఇట్లు పలికారు... "కళా సంపదల సద్వినియోగ పరచే సమస్య సమాజ నాయకులు తమ మనసు నందుంచుకొనుట వారి విద్యుక్త ధర్మం.

కళా సంపదల దుర్వినియోగమునకు నా దృష్టిలో వున్న ఉదాహరణం నేడు అధిక ప్రచారం కలిగివున్న చలన చిత్రాలు" నిర్మాతలారా, ఖబడదార్!

### పవర్ హౌసను స్వాధీనం చేసుకోవాలి

మునుపటి గవర్నమెంటు

తరువాయి 10వ పేజీలో

---

**జనవాణి**

# పేదల ఆత్మార్పణకు విలువ లేదా?

48ఏళ్ల క్రితం పొట్టి శ్రీరాములు గారి ఆత్మ బలిదానం వార్త దావానలంగా ఆంధ్ర రాష్ట్రమంతా ప్రాకింది. డిశంబర్ 16తేది నెల్లూరు రైల్వే స్టేషన్ వద్ద గుమిగూడిన ప్రజల మీద ఆనాటి డిఎస్పీ జాన్ కాల్పులకు ఉత్తర్వు చేశారు. ఆ తుపాకి కాల్పుల్లో ట్రెయినింగ్ స్కూల్ విద్యార్థి ఎన్. ఇబ్రాయిల్, కూరగాయల మార్కెట్‌లో గుమస్తా కె. గురుస్వామి, స్టోన్‌హౌస్‌పేటలో థర్డ్‌ఫారం విద్యార్థి పొట్లూరు నాగేశ్వరరావు, నెల్లూరు ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్ కోర్టులో పనిచేసే మహాల్టీ ప్రాణాలు కోల్పోయారు. సుమారు 20 మందికి తుపాకి తూటాల గాయాలయ్యాయి. చనిపోయిన వారందరూ పేద యువకులు. అమరవీరుల జ్ఞాపకార్థం తుపాకి కాల్పులు జరిగిన రైల్వే స్టేషన్‌కు ఎదురుగుండా ఒక స్థూపాన్ని నిర్మించాలని ప్రభుత్వాన్ని పదే పదే విన్నవించుకొన్నాం. వీరి ప్రాణ త్యాగాలతో ఏర్పడ్డ రాష్ట్ర ప్రభుత్వం ఆ విన్నపాన్ని పట్టించుకోలేదు. ఆఖరకు కలెక్టర్‌గా హెచ్.కె.బాబు పనిచేస్తున్నప్పుడు ఒక కమిటీని వేసి స్థూప నిర్మాణానికి ఏర్పాట్లు పూర్తి చేశారు. ఈలోగానే ఆయన బదిలీ అయ్యారు. ఆ తర్వాత వచ్చిన కలెక్టర్లు ఎవరూ ఈ విషయాన్ని పట్టించుకోలేదు. కలెక్టర్ శ్రీలక్ష్మి ఈ విషయమై స్పందించేలోపు ఆమె బదలీ అయ్యారు. పేదలు ప్రత్యేక రాష్ట్రం కొరకు ప్రాణాలు అర్పిస్తే వారికి గుర్తింపు లేదు. ఆంధ్ర రాష్ట్ర ఏర్పడ్డాక ఎందరో ఎమ్మెల్యేలు, మంత్రులు, ముఖ్యమంత్రులు అయ్యారు. కోట్ల కోట్ల ధనం, ఆస్తులు సంపాదించారు. కాని నిరుపేదలైన అమరజీవులను అందరూ నిర్లక్ష్యం చేశారు.

నెల్లూరు వి.అనంతరామయ్య (అడ్వొకేట్)

### క్రీడాకారులకు ప్రోత్సాహమేది?

భారతదేశం యావత్తూ సిడ్నీ ఒలింపిక్స్‌లో మనదేశ జెండా రెపరెపలాడాలని ఎంతో ఆశగా ఎదురు చూశారు. ఈ కోరికను మన తెలుగింటి ఆడపడుచు, కరణం మల్లీశ్వరి వెయిట్ లిఫ్టింగ్‌లో కాంస్యపతకాన్ని సాధించి తీర్చింది. మనదేశంలో క్రీడల్లో రాణించే రత్నాల వంటి యువతీ, యువకులు ఎందరో వున్నారు. కాని వీరిని ప్రోత్సహించే వారే లేరు. శిక్షణ వసతులులేక, ఆర్థికపరమైన ఇబ్బందులను ఎదురీదలేక క్రీడాకారులు కునారిల్లు తున్నారు. దేశంలో క్రీడాభివృద్ధికి కేంద్ర ప్రభుత్వం ఒక సమగ్ర ప్రణాళికను తయారు చేయాలి. మంచి కోచ్‌లు, స్వార్థంలేని సెలక్టర్లు, రాజకీయ నాయకుల సిఫార్సులతో ఎంపికలు లేకుండా పోతే ప్రతి క్రీడోత్సవంలో మనకు పతకాలు ఖాయం.

నెల్లూరు సోలా జానకి దేవి (వెటరన్ క్రీడాకారిణి)

### మల్లీశ్వరికి అభినందనలు

తెలుగు ఆడపడుచు, కరణం మల్లీశ్వరి సిడ్నీ ఒలింపిక్స్ వెయిట్ లిఫ్టింగ్ విభాగంలో కాంస్య పతకం సాధించి దేశకీర్తి ప్రతిష్టలు మరింతగా పెంచింది. వందేళ్ల చరిత్రగల ఒలింపిక్స్‌లో పతాకం సాధించిన భారత నారీమణి లేని లోటును మల్లీశ్వరి కనుమరుగయ్యేలా చేసింది. 150 మంది క్రీడాకారులు సిడ్నీకి తరలవెళ్లినా ముందుగా పతకం సాధించిన మల్లీశ్వరిని, ఒలింపిక్స్‌కు పంపాలా వద్దా అని అధికారులు మీనమేషాలు లెక్కపెట్టారంటే ఈ ఎంపిక ఏవిధంగా వుందో అర్థం చేసు కోవచ్చు.

తరువాయి 10వ పేజీలో

# కొత్త అయ్యోర్లకు ఇక ఏదిదారి?

విద్యాశాఖాధికార్లు కొత్తగా చేపట్టిన రేషనలైజేషన్ ప్రక్రియ వల్ల, ఇటీవల ప్రభుత్వం నిర్వహించిన టీచర్స్ రిక్రూట్‌మెంట్ టెస్ట్ (డిఎస్‌సి)లో ఉత్తీర్ణులైన వారికి పోస్టులే లేకుండా పోయే ప్రమాదం

## లెక్కకురాని ఖాళీలు మూతపడుతున్న స్కూళ్లు

ఏర్పడింది. రేషనలైజేషన్‌లో ఒక ఉపాధ్యాయుడికి నలభై మంది విద్యార్థులను కేటాయిస్తారు. ఈ సంఖ్యకు తక్కువగా విద్యార్థులున్న పాఠశాలలుంటే వీటిని కుదించి ఒకటిగా చేస్తారు. దీనివల్ల 20 మంది కంటే తక్కువ విద్యార్థులున్న ప్రాథమిక పాఠశాలలు మూతపడి పోతాయి. అక్కడ చదివే విద్యార్థులు, పనిచేసే ఉపాధ్యాయులు మరో పాఠశాలకు బదలీ అయిపోతారు. రేషనలైజేషన్ మూలంగా ఇప్పటికే రాపూరు మండలంలో 14 మంది ఉపాధ్యాయులు ఎక్కువయ్యారు. నెల్లూరు మునిసిపాలిటీలో ఒక్క ఉపాధ్యాయ పోస్ట్ కూడా ఖాళీ లేకుండా పోయినట్లు విశ్వసనీయంగా తెలిసింది.

కానీ జూలై 3తేదిప్రాథమిక విద్యాశాఖ జారీచేసిన డిఎస్‌సి నోటిఫికేషన్‌లో జిల్లాలో 857 ఉపాధ్యాయ పోస్టులు ఖాళీగా వున్నట్లు పేర్కొన్నారు. బియిడి.

తరువాయి 11వ పేజీలో



జిల్లా కాంగ్రెస్ విస్తృత సమావేశంలో మాట్లాడుతున్న ఎఐసిసి సభ్యుడు నేదురుమల్లి పద్మనాభరెడ్డి. ప్రక్కన వివేకానందరెడ్డి, రాజ్యలక్ష్మమ్మ, దేవకుమార్‌రెడ్డి, పనబాకలక్ష్మి కూర్చొని వున్నారు.

# డి.డి.ఆర్.సి.లో కరవుపై కసుర్లు - వరదలపై విసుర్లు!

జిల్లాలో నెలకొన్న కరవు పరిస్థితిపై కసుర్లు, పెన్నా వరదలపై విసుర్లతో సోమవారం నాటి డిడిఆర్‌సి సమావేశం రసవత్తరంగా జరిగింది. జిల్లాలో కరవు నివారణ పేరుతో గత సమావేశాల్లో అనేక అంశాలపై చర్చ జరిగిందని, వాటిలో ఒక్కటి కూడా అమలు కాలేదని రాపూరు ఎమ్మెల్యే రామనారాయణరెడ్డి విమర్శించారు. జరిగిపోయిన సమావేశాల్లో తీసుకున్న నిర్ణయాలను అమలు పరచకుండా, వాటిని సమీక్షించకుండా డిడిఆర్‌సి సమావేశాలు జరిపితే లాభం ఏమిటని నిలదీశారు. పెన్నానదికి ఆకస్మికంగా వచ్చిన వరదలపై తనకు సమగ్రమైన సమాచారం అందించడంలో ఇంజనీర్లు విఫలమయ్యారని కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ అంగీకరించారు. ఆత్మకూరు ఎమ్మెల్యే బొల్లినేని ఈ విషయమై అధికార్లను నిలదీశారు.

సాధారణంగా వాద, ప్రతివాదనలతో దద్దరిల్లే జిల్లా అభివృద్ధి సమీక్షా సంఘం సమావేశం 25తేది గోల్డన్ జూబ్లీ హాల్‌లో ప్రశాంతంగా జరిగింది. జిల్లాలో ఇటీవల సంభవించిన కరవు, వరద పరిస్థితులపై సమావేశం క్షుణ్ణంగా చర్చించింది. సమావేశంలో వివాదాలు రేగకుండా జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి చిక్కాల రామచంద్రరావు చాకచక్యంగా సభ నడిపారు. ప్రతిపక్ష ఎమ్మెల్యేలతోపాటు, స్వపక్ష ఎమ్మెల్యేలు పలు సమస్యలపై విపులంగా మాట్లాడే అవకాశమిచ్చారు. అధికారుల్లో జవాబుదారీ తనం, బాధ్యత తగ్గిపోతుందని జిల్లా కలెక్టర్ ప్రవీణ్ కుమార్ సభలో ఆవేదన వ్యక్తం చేయబోగా ఇన్‌ఛార్జ్ మంత్రి ఆయన్ను నిలువరించారు. జిల్లాలో ఏ అధికారి తప్పు చేసినా అందుకు బాధ్యత కలెక్టర్‌దే నన్నారు. ఎప్పుడూ రాని ఎమ్మెల్సీ వుక్కాల రాజేశ్వరమ్మ తరలి వచ్చి నోరు మెదపక సమావేశాన్ని కడవరకు వీక్షించారు.

గత నెల 22తేది పెన్నానదికి వరద రాగా 23 గ్రామాలు దెబ్బతిన్నాయని, 1142 మందిని సురక్షిత ప్రాంతాలకు తరలించినట్లు అధికారులు ప్రకటించగానే దీన్ని సభ్యులు వ్యతిరేకించారు. ఆత్మకూరు ఎమ్మెల్యే బొల్లినేని కృష్ణయ్య మాట్లాడుతూ పెన్నానదికి వరద

## వరదలపై సమాచారం లోపం ఇంజనీర్ల వైఫల్యమే!

సమావేశంలో ఇన్‌ఛార్జి మంత్రి చిక్కాల రామచంద్రరావు అధ్యక్షోపన్యాసం చేస్తూ ప్రభుత్వమే జిల్లా అభివృద్ధి మండళ్ల సమావేశపు తారీఖులు ఖరారు చేసినందువల్ల సమావేశం కాస్త ఆలస్యమయ్యింది. జిల్లాలో ప్రధానంగా సాగు - త్రాగునీరు సమస్యను ఎదుర్కొంటున్నట్లు చెబుతూ, ఎమ్మెల్యేందరూ కలసికట్టుగా వుండి జిల్లాకు అధిక నిధులు తెచ్చుకోను ప్రయత్నించాలన్నారు. గత సమావేశపు చర్చనీయాంశాలపై శాఖాపరమైన చర్యల గురించి మంత్రి మాట్లాడుతుండగా నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి అడ్డుతగిలారు. గత సమావేశంలో సంగం - పెన్నా వారధుల గూర్చి చర్చించాం. కాని తీసుకొన్న చర్యలేమిటి? కరవులో రైతులకు రుణాలు రీషెడ్యూల్ చేస్తామన్నారు. ఇంకా చేయలేదు. విద్యార్థులకు స్కూల్ ఫీజులు సైతం మాఫీ చేయలేదు. మొక్కుబడి సమావేశాలెందుకన్నారాయన.

వస్తున్న విషయాన్ని ముందుగా అధికారులు వరద తాకిడి తగిలే గ్రామాలకు తెలియచేయలేదు. అందువల్లే కోటితీర్థంలో నలుగురు అమ్మాయిలు నదిలో కొట్టుక పోయారు. పెన్నానది ఎగువ ప్రాంతాల్లో వర్షం పడితే, నెల్లూరులోని సోమశిల ప్రాజెక్ట్ అధికారులు తెలుసుకోక పోవడం విడ్డూరంగా వుందన్నారు. రాపూరు ఎమ్మెల్యే రామనారాయణరెడ్డి మాట్లాడుతూ అధికారుల నిర్లక్ష్యం వల్ల ప్రాణాలు కోల్పోయిన నలుగురు అభాగ్య యువతులకు ముఖ్యమంత్రి సహాయ నిధి నుంచి కూడా సహాయం అందించాలన్నారు. పెన్నానది నుంచి ఇసుకను తీసుకెళ్లి అమ్ముకొనే వాళ్లు వరద కట్టలను తెగనరికి బాటలుగా వేసుకొన్నట్లు చెప్పారు. నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మాట్లాడుతూ టౌన్‌లోని పొర్లుకట్ట, వెంకటేశ్వరపురం, జకీర్‌హుస్సేన్ నగర్ ప్రాంతాలు ప్రతిసారి వరద తాకిడికి గురౌతున్నాయి. ఈ ప్రాంతంలో అడ్డుకట్టల నిర్మాణానికి ప్రతిపాదనలు తయారు చేయించాలని కోరారు. గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్ మాట్లాడుతూ 50 టిఎంసిల పెన్న నీళ్లు వృధాగా సముద్రం పాలయ్యాయి. గూడూరు డివిజన్ మాత్రం ఇంకా దాహార్తితో అల్లాడుతుందన్నారు. తెలుగుగంగ నుంచి స్వర్ణముఖికి వదలుతున్న నీటి శాతాన్ని పెంచాలని కోరారు. ఉదయగిరి ఎమ్మెల్యే కంభం విజయరామిరెడ్డి మాట్లాడుతూ అక్టోబర్, నవంబర్ నెలలో మ[illegible] కురిసే అవకాశం వున్నందున అధికారులు అప్రమత్తంగా వుండాలన్నారు.

ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి మాట్లాడుతూ పెన్న ఎగువ ప్రాంతమైన నంద్యాల, కర్నూల్‌లో విపరీతంగా వర్షం పడి ఆ ప్రాంతాలు మునిగిపోయాయని హైదరాబాద్‌లో వున్న మాకు సమాచారం అందింది. కాని సోమశిల ప్రాజెక్ట్ అధికారులు దీన్ని తెలుసుకోక పోవడమేమిటి? మరోసారి ఈ తప్పు జరగకుండా అక్టోబర్ - నవంబర్‌లలో జిల్లాకు అవ[illegible] 100 కిలోమీటర్ల దూరంలో పెన్నా[illegible] నీటి ప్రవాహం తెలుసుకొనేందుకు వైర్‌లె[illegible] సెట్లు ఇచ్చి ఇద్దరు అధికారులన[illegible] నియమించమన్నారు. ఈ దశలో చర్చల[illegible] జోక్యం చేసుకున్న కలెక్టర్ ప్రవీణ్‌కుమా[illegible] మాట్లాడుతూ 23తేది అర్ధరాత్రి 1 గం[illegible] వరకు తాను మేలుకొని వున్నా నీ[illegible]

తరువాయి 11వ పేజీలో

# దగాలకు,దౌర్జన్యాలకు అంతంలేదా?

ఎసి కూరగాయల మార్కెట్‌లో వ్యాపారస్తులు చేసే దోపిడి, దౌర్జన్యాలు నానాటికి ఎక్కువై పోతున్నాయి. 25తేది మార్కెట్‌లో తాను కొన్న టమోటాలు బాగోలేవని తిరిగి తీసుకోమన్న వినియోగదారుడిని ఇక్కడి వ్యాపారి తలపగుల గొట్టాడు. మార్కెట్‌లో ఈ దౌర్జన్యాలను పెంచిపోషించే నాయకుడు జోక్యం చేసుకోవడంతో తల పగుల కొట్టించుకున్న వ్యక్తికి పోలీసు కేసు పెట్టను కూడా ధైర్యం చాలలేదు. కూరగాయల మార్కెట్ మోసగాళ్ల నిలయమయ్యింది. మార్కెట్‌లోని ఏ షాపులోనైనా కేజీ కూరగాయలు కొని బయటకు వచ్చి తూకం వేయిస్తే 750 గ్రాములే వుంటాయి. ఇక్కడి వ్యాపారస్తులు చెప్పిన రేటుకు పైసాతగ్గించరు. మంచి కూరగాయలు ఏరుకొనేందుకు చేయి పెట్టను ఒప్పుకోరు. వినియోగదారుడు ఏదైనా మాట్లాడితే స్త్రీ, పురుష భేదం లేకుండా అసహ్యంగా తిడతారు. వీరికి పక్క షాపుల వాళ్లు కూడా మద్దతు రావడం వల్ల వినియోగదారుడు నోరు మూసుకొని రావాల్సిందే. తూకం, ధరల వ్యవహారమై తూనికల కొలతల శాఖాధికారులు గానీ, మార్కెటింగ్ శాఖాధికారులు కానీ పట్టించుకోరు. లంచాల అమేధ్యంతో వీరి నోళ్లు మూతపడిపోతాయి. మార్కెట్‌లో జరిగే సమస్త అన్యాయాలు, అక్రమాల నుంచి వ్యాపారస్తులను రక్షించను ఒక వ్యక్తి రక్షణగా వున్నాడు. ఇతనంటే

## నెల్లూరుసంగతులు

మునిసిపాలిటికి సైతం భయం కాబట్టి మార్కెట్ ప్రారంభించి ఏళ్లు గడుస్తున్నా ఇంత వరకు మార్కెట్ ముందు స్కూటర్, సైకిల్ స్టాండుకు పాట పెట్టలేదు. మార్కెట్ పెద్ద రౌడీనే దీనికి పాట పెట్టి లాభం పొందుతున్నాడు. ఇటీవల కలెక్టర్ మునిసిపల్ కౌన్సిలర్లతో పెట్టిన ప్రత్యేక సమావేశంలో ఈ స్టాండ్‌ను మునిసిపాలిటీకి అప్పగించేలా చర్యలు తీసుకోమని కొందరు కౌన్సిలర్లు, కలెక్టర్ను కోరారంటే ఇక్కడి పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు. మార్కెట్‌లోని వ్యాపారస్తులతో కలెక్టర్ ఒక ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేసి వారి వ్యవహారధోరణిలో మార్పు వచ్చేలా చర్యలు తీసుకోవాలి. ధోరణి మార్చుకోని వ్యాపారస్తుల షాపు లైసెన్సుల రద్దువంటి పనులకు మార్కెటింగ్ శాఖ శ్రీకారం చుట్టాలి.

## డిఇఓ ఆఫీసులో మేధావులు!

ప్రపంచ వ్యాప్తంగా ఎప్పటికప్పుడు జరుగుతున్న పరిణామాలను తెలుసుకొని అందరికి చెప్పాల్సిన విద్యాశా[illegible] లను ఇంకా అజ్ఞానంలో వున్నారని చెప్పవచ్చు. ప్రభుత్వం నుంచి వెలువడే ఉత్తర్వులను అందరు ఉపాధ్యాయులు తెలుసుకొను డిఇఓ కార్యాలయం పత్రికా కార్యాలయాలకు ప్రకటనలు విడుదల చేస్తుంది. ఈ మధ్య డిఇఓ కార్యాలయం విడుదల చేసే ప్రకటనల్లో ఆంధ్రపత్రిక కార్యాలయానికి కూడ ప్రకటనలు

తరువాయి 11వ పేజీలో

# ధన్యజీవి! జక్కా రంగారెడ్డి!!

జిల్లాలో రైతు సమస్యల పరిష్కారానికి నిరంతరం పరితపించి, శ్రమించిన జక్కా రంగారెడ్డి మరణం రైతులోకానికి తీరనిలోటని పలువురు ప్రముఖులు నివాళులర్పించారు.

గురువారం నాడు జగదేవిపేటలో

## సంతాప సభలో ప్రముఖుల నివాళి

దశ దినకర్మ సందర్భంగా అఖిలపక్ష రైతు పోరాట కమిటీ ఆధ్వర్యంలో రంగారెడ్డి సంతాప సభ జరిగింది. గృహ నిర్మాణ శాఖ మంత్రి ఆదాల ప్రభాకర రెడ్డి మాట్లాడుతూ రంగారెడ్డి తమను ఎంతో క్రమశిక్షణతో తీర్చిదిద్దారని అన్నారు. నేటి తన ఉన్నతికి బాటలు వేసిన మహనీయుడని కొనియాడారు. జిల్లాలో రైతు సమస్యలపై ఆయనకున్న అవగాహన, వాటిని పరిష్కరించాలన్న తపన ప్రశంసనీయమని అన్నారు. మాజీ ఎమ్మెల్యే జక్కా వెంకయ్య మాట్లాడుతూ రైతుల సేవలో రంగారెడ్డి జన్మ సార్థకమైందన్నారు. ఆయన ఇల్లు నిరంతరం రైతాంగం సమస్యలపై చర్చలకు నిలయమయ్యేదని చెప్పారు. రైతు సమస్యలపై తప్ప, రాజకీయాల ఊసెత్తని రైతు నాయకుడని రంగారెడ్డిని కొనియాడారు. సర్వేపల్లి ఎమ్మెల్యే చంద్రమోహన్‌రెడ్డి రంగారెడ్డికి తాను ఐదో కొడుకులాంటి వాడినన్నారు. రాజకీయాలకు అతీతంగా ఆయన తనను పుత్రవాత్సల్యంతో

తరువాయి 8వ పేజీలో



కొడవలూరులో జరిగిన సభలో మాట్లాడుతున్న జిల్లాకలెక్టర్ ప్రవీణ్‌కుమార్, ప్రక్కన పట్టాభి, ఎమ్మెల్యే ప్రసన్నకుమార్ రెడ్డి, జిల్లా హౌసింగ్ బోర్డు మేనేజరు రవిప్రకాష్ వున్నారు.

# గిట్టుబాటు ధరకోసం కృషిచేస్తా

చెరకు పంటకు టన్నుకు 850 రూపాయల వంతున గిట్టుబాటు ధర లభించేలా చేసేందుకు, ఈ విషయంలో ప్రభుత్వాన్ని ఒప్పించేందుకు అన్ని చర్యలు తీసుకొంటామని కోవూరు షుగర్ ఫ్యాక్టరీ ఛైర్మన్ సామంతు సుబ్బారెడ్డి చెప్పారు. 22తేది జరిగిన ఫ్యాక్టరీ సర్వ సభ్య సమావేశంలో మాట్లాడారు. ఫ్యాక్టరీ పరిస్థితి బాగోలేదు. అయితే సామర్థ్యం పెంపుదల చేయకపోతే ఫ్యాక్టరీ మనుగడకే ముప్పు ఏర్పడుతుంది. ఫ్యాక్టరీలో విద్యుత్ ఉత్పాదక కేంద్రం ఏర్పాటు చేసి తద్వార వచ్చిన విద్యుత్‌ను థర్మల్ కేంద్రానికి

## చెరకు రైతులకు సామంతు హామీ

విక్రయించే ఆలోచన వున్నట్లు చెప్పారు. రైతు సంఘం అధ్యక్షుడు గునుపాటి రామచంద్రారెడ్డి మాట్లాడుతూ చెరకు ధర ఆదాయంగా లేదనే రైతులు రొయ్యల సాగు వైపు మొగ్గు చూపుతున్నట్లు చెప్పారు. రైతు దువ్వూరు ప్రకాశరావు మాట్లాడుతూ సర్వసభ్య సమావేశంలోని నివేదిక తప్పుల తడికగా అభివర్ణించారు. సిడిసి కార్యాలయాన్ని ఫ్యాక్టరీ ప్రాంగణంలో ఏర్పాటు చేయాలన్నారు. కె. చంద్రమోహన్‌రెడ్డి మాట్లాడుతూ చెరకు మద్దతు ధర 850 రూపాయలుగా నిర్ణయించాలన్నారు. జెట్టి రామచంద్రారెడ్డి మాట్లాడుతూ ఫ్యాక్టరీ రైతులకు ప్రోత్సాహకాలు అందివ్వాలన్నారు. చెర్లోపాళెం రైతు డి. నిరంజన్‌రెడ్డి మాట్లాడుతూ మొక్కుబడిగా ఈ సమావేశాలు నిర్వహిస్తుండే తప్ప రైతులకు ఎటువంటి మేలు జరగడం లేదని విమర్శించారు. రైతులు అడిగిన ప్రశ్నలకు ఫ్యాక్టరీ ఎం.డి. సరైన వివరణ ఇవ్వలేక పోయారు.

## మరో మలుపు తిరిగిన రత్నమ్మ హత్యకేసు

వరికుంటపాడు మండలం నల్లబోతులవారి పల్లెకు చెందిన వివాహిత తమ్మిశెట్టి రత్నమ్మ హత్యకేసు మరో మలుపు తిరిగింది. ఈ హత్య కేసులో పోలీసులు వారి చిత్తం వచ్చినట్లు వ్యవహరించి నలుగురు అమాయకులను దీనిలో ఇరికించారు. వాస్తవంగా రత్నమ్మ హత్యకు ఆమె బంధువులే కారణమని ప్రత్యేక విచారణాధికారి కావలి డిఎస్పీ రెడ్డయ్య నిర్ధారణకు వచ్చారు. దర్యాప్తులో హతురాలి మేనమామలు తాము హత్యకు ఉపయోగించిన వస్తువులను బండ్లబావిలో వేసామని చెప్పగా, పోలీసులు ఆయిల్ ఇంజన్లు పెట్టి నీరు తోడించారు. బావిలో ఒక గొడ్డలి, కర్రతోపాటు కొన్ని మద్యం బాటిళ్లు దొరికాయి. ఈ కేసులో ప్రధాన సాక్షిగా

తరువాయి 8వ పేజీలో

# దోపిడీ దొంగల దుర్గం-ఉదయగిరి

నెల్లూరు జిల్లాలో కరడుగట్టిన దోపిడీ దొంగల ముఠా స్థావరం ఏర్పరుచుకోవడంతో ప్రజలు భయభ్రాంతులవుతున్నారు. మర్రిపాడు మండలం గంగుంట వద్ద కార్లు, బస్సులాపి 16 లక్షలు దోచుకొన్న దొంగలు మన జిల్లా పోలీసు సమర్థతకు సవాల్ విసిరారు. ఈ ఘటనతో బస్సు ప్రయాణీకుల్లోనే కాదు, ప్రజల్లోనూ ఆందోళన మొదలైంది.

నెల్లూరు నుంచి కడపకు వెళ్తున్న ఆర్టీసి బస్సును దుండగులు 22తేది

## ప్రాణాలు అరచేతిలో పెట్టుకున్న ప్రజలు

సాయంత్రం ఆరేడు గంటల మధ్య గంగుంట వద్ద రహదారిపై రాళ్లు అడ్డంగా పెట్టి ఆపారు. డ్రైవర్‌ను తాళ్లతో కట్టి ప్రక్కన ఆపివున్న మెటాడోర్ వ్యాన్‌లో పడేశారు. మారణాయుధాలు ధరించిన దుండగులు బస్సులోకి ప్రవేశించి నంద్యాలలోని నందిపైపుల కంపెనీలోని గుమస్తా ప్రకాష్‌రెడ్డి నుంచి 15లక్షల మూడు వేల రెండు వందల రూపాయలు దోచుకున్నారు. సౌదికి వెళ్తున్న మహబూబ్ బాషా, నాయబ్‌రసూల్ వద్ద 50వేలు, కండక్టర్ దగ్గర 783, ఇతర ప్రయాణీకుల చెవులు, మెడల్లోని బంగారు ఆభరణాలు పట్టుకెళ్లారు. ఈ దోపిడీకి ముందు రెండు లారీలు, ఒక మెటాడోర్ వ్యాన్‌నూ దోచుకున్నారు. ప్రయాణీకులను కొట్టడం ద్వారా బస్సులో భయోత్పాతం సృష్టించారు. రాత్రి ఏడున్నర దాటాక బస్సుల్లో పోలీసు సెక్యూరిటీ వుంటుందని ముందుగానే పసిగట్టిన దొంగలు ఏడు గంటల లోపే దర్జాగా తమ పని ముగించడం విశేషం.

ఈ ముఠా సభ్యులు కొందరు 25 తేది మధ్యాహ్నం సీతారాంపురం మండలం బసినేనిపల్లి గ్రామానికి వచ్చినట్లు గ్రామస్తులు నమ్మకంగా చెబుతున్నారు. వీరు కొబ్బరి బొండాలు, వడలు, మద్యం సీసాలు, సిగరెట్లు కొనుగోలు చేసి ఆ షాపు వారి ముందు వంద రూపాయల నోట్ల కట్టల నుంచి డబ్బులు తీసిచ్చారట. ఇది గమనించిన యువకులు కొందరు వారు దోపిడీదొంగలై వుండవచ్చని భావించి వెంబడించారు. అడవుల్లోని స్థావరం వరకు గమ్మున వెళ్లిన వారు మిగతా వాళ్లతో కలసి కత్తులుతీసి బెదరించడంతో వెళ్లినవారు వెనుతిరిగి వచ్చారట. ఈ విషయం తెలుసుకొన్న గుంటూరు డిఐజి మాలకొండయ్య మరునటి రోజు బసినేనిపల్లి గ్రామాన్ని సందర్శించి సమీపంలోని అడవుల్లో గాలింపు చేపట్టినా ఫలితం లేకుండా పోయింది. డిఐజి మంగళవారం నెల్లూరులో విలేఖరులతో మాట్లాడుతూ దోపిడీ దొంగల ఆచూకీ తెలిసిందని వారిని ఖచ్చితంగా పట్టేస్తామన్నారు. వారి కోసం అడిషనల్ ఎస్పీ రవికుమార్ మూర్తి ఆధ్వర్యంలో ప్రత్యేక బృందాలను ఏర్పాటు చేశారు.

గత నెల 4తేది నుంచి ఒక సంచార దోపిడీ ముఠా, ఉదయగిరి, సీతారాంపురం కొండ క్రింది గ్రామాల్లో సంచరిస్తున్నట్లు పోలీసుల వద్ద స్పష్టమైన సమాచారం వున్నా, వాళ్లు పట్టించుకోలేదు. ఇప్పటికైనా దొంగలను పట్టుకోవాలన్న చిత్త శుద్ధి పోలీసుల్లో వుంటే సరిహద్దు గ్రామాల ప్రజల సహకారంతో ఆయా ప్రాంతాల రహదార్లన్నింటిపై నిఘా ముమ్మరం చేయాలి. సిద్ధేశ్వరం కొండల్లో పోలీసు క్యాంపును శాశ్వతంగా ఏర్పాటు చేయడంతో పాటు, అడవుల్లోని కాలిబాట లన్నింటిపై గట్టి నిఘా వుంచితే తినే ఆహారం కోసమైనా దొంగ

తరువాయి 8వ పేజీలో

## జిల్లావార్తలు

## నెల్లూరు ముచ్చట్లు

### కమీషనర్‌ను నిలదీస్తున్న సిబ్బంది

మునిసిపల్ కమీషనర్‌తో మాట్లాడాలంటే మునిసిపల్ ఉద్యోగులు గతంలో గడగడలాడేవారు. ఇప్పుడైతే కమీషనర్‌ను ప్రత్యక్షంగా నిలదీయడంతోపాటు తగాదాకు దిగుతున్నారు.

మునిసిపల్ పారిశుధ్య సిబ్బంది తమకు మూడు నెలలుగా జీతాలు చెల్లించని కమీషనర్‌ను 27తేది దులిపి పారేశారు. గత నెలలో జీతాలడిగితే ఈ నెల 25తేది చెల్లిస్తానని కమీషనర్ హామీ ఇచ్చారట. కాని వాటిని చెల్లించకపోవడంతో కమీషనర్‌పై తిట్ల వర్షం కురిసింది. రోజుకు 1.40 లక్షల మునిసిపల్ ఆదాయం వస్తున్నా కమీషనర్ వాటిని ఇష్టమొచ్చినట్లు ఖర్చుపెడుతున్నారని పారిశుధ్య సిబ్బంది వాదన. రిజిష్టార్ కార్యాలయం నుంచి స్టాంపు డ్యూటీగా రావల్సిన 70లక్షలు రాగానే జీతాలిస్తానని కమీషనర్ చెబుతున్నారు.

ఇద్దరి మధ్య 28తేది సయోధ్య కుదిరి మునిసిపల్ కార్మికుల సమ్మె సమస్య తప్పింది.

### నీటిపథకానికి హడ్కో గ్రీన్ సిగ్నల్

నెల్లూరు టౌన్ రైలు కట్ట అవతల తూర్పు ప్రాంతీయుల మంచినీటి అవసరాలు తీర్చేందుకు హడ్కో సంస్థ 7కోట్ల 9లక్షల రూపాయలు మంజూరు చేసింది. ఈ నిధులతో చేపట్టె కొత్త పథకం వల్ల ఎసినగర్, హరనాథపురం, ముత్యాలపాళెం, మాగుంట లేఅవుట్, ఉమ్మారెడ్డిగుంట, కొండాయపాళెం, భక్తవత్సలనగర్ ప్రాంతీయులకు నీటిని సరఫరా చేస్తారు. పై ప్రాంతాలు నెల్లూరుటౌన్‌లో వున్నా ఇంత వరకు వారికి పెన్నానీరు తాగే యోగం లేదు. కొత్త పథకం వల్ల కోటి యాభైలక్షల గ్యాలన్ల నీరు ఈ ప్రాంతీయులకు ప్రతి నిత్యం సరఫరా అవుతుంది.

మంజూరైన నిధుల్లో ఐదున్నర కోట్లు మెయిన్ పైప్ లైన్ నిర్మాణానికి మిగిలిన నిధులు పెన్నలో బావుల నిర్మాణం, మోటార్లు సమకూర్చుకోవడానికి వినియోగిస్తారు. ఈ నిధులతో పెన్నలో 7 బావులు త్రవ్వుతారు. కొత్త గ్యాలరీని నిర్మిస్తారు. ముత్యాలపాళెం, మాగుంటలేఅవుట్, ఉమ్మారెడ్డి గుంట ప్రాంతాల్లో కొత్తగా మూడు ట్యాంకులు నిర్మిస్తారు.

నిధులు విడుదల కావడం వల్ల సత్వరం ఈ పనులు మొదలవుతాయి. రెండేళ్లలో ప్రజలకు పెన్నానీళ్లు లభ్యమవుతాయి. దాహార్తితో అల్లాడుతున్న ప్రజలకు ఇది భగీరథ పథకమేననాలి.

### ఆటోడ్రైవర్ ఆదర్శం

నెల్లూరుటౌన్‌లో తిరిగే ఒక ఆటో వెనుక "గర్భిణీ స్త్రీలను ఉచితంగా ఆసుపత్రికి తీసుకొని పోబడును" అనే మాటలు రాసి వున్నాయి. ఆటో డ్రైవర్‌గా చిన్న పని చేస్తున్నా, అతని మనసెంత ఉన్నతమైనదో అంచనా వేయలేం. ఇతన్ని చూసైన మరికొందరు సంఘ సేవకు పూనుకొంటే సమాజం కొద్దిగానైనా బాగుపడుతుంది. టౌన్‌లో కొన్ని క్లబ్‌లు, సంస్థలు మేక తోలు కప్పుకున్న పులుల్ని సన్మానించే బదులు, ఇటువంటి సంఘ సేవకుల్ని సత్కరించడం సముచితం.

### ప్రాణం తీసిన టౌన్‌బస్సు

ప్రజల ప్రాణాలను దారుణంగా తీయడంలో తిరుగులేని టౌన్‌బస్సుల రక్తదాహానికి మరో యువకుడు బలయ్యాడు. తడికల బజారు ప్రాంతానికి చెందిన కుమార్ (20) కూలీ పనికి వెళ్లేందుకు సైకిల్‌పై వస్తుండగా, ఆర్టీసి బస్టాండు సమీపంలో లక్ష్మీపురం - బుజబుజనెల్లూరు మధ్య తిరిగే టౌన్ బస్సు వేగంగా వచ్చి ఢీ కొట్టింది. ఈ ప్రమాదంలో అతను తీవ్రంగా గాయపడి అక్కడికక్కడే ప్రాణాలు వదిలాడు. లెక్కలేనంత మంది ప్రాణాలు తీస్తున్న

కొరవ 7వ పేజీలో



# పార్టీ పగ్గాలకోసం కాటాకుస్తీ

నెల్లూరు అసెంబ్లీ నియోజకవర్గ ఇన్‌ఛార్జి పదవి కోసం తెలుగుదేశం పార్టీలో అంతర్గత పోరు తీవ్రస్థాయికి చేరుకుంది. దీనికోసం రమేష్‌రెడ్డి జీవన్మరణ పోరాటం చేస్తున్నాడు. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడి అనుగ్రహం కోసం పరిపరి విధాలా తాపత్రయపడుతున్నాడు. ఒక వంక సోమిరెడ్డిని, మరో వంక నల్లపరెడ్డిని పట్టుకొని, సహాయం చేయమని ప్రాధేయపడుతున్నాడు. ఇటీవల నెల్లూరుకు వచ్చిన పార్టీ పరిశీలకుడు నారాయణయ్య దగ్గరైతే, భోరున విలపించినంత పనిచేశాడు. తనకు పార్టీ పదవి ఇవ్వకపోతే, ఛైర్‌పర్సన్‌గా తన భార్య అనూరాధ సక్రమంగా పనిచేయలేదని చెప్పాడట. పార్టీ పగ్గాలు తన ప్రత్యర్థులకిస్తే ఛైర్‌పర్సన్ పదవిలో ఆమెను కొనసాగించే విషయం ఆలోచిస్తానని పరోక్షంగా హెచ్చరిక కూడా చేశాడట. విద్యుత్ సంస్కరణలపై జరిగిన జన్మభూమి సభల్లో కాంగ్రెస్, కమ్యూనిస్టులను తాను తన భార్య అనూరాధ మాత్రమే ఎదుర్కొన్నామని పత్రికల వార్తలు, ఫోటోలను చూపించి వివరించాడట. పార్టీ ఇన్‌ఛార్జి పదవికి దీనినే కొలమానంగా తీసుకోవాలని కోరాడట. మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి కుటిల రాజకీయం చేస్తున్నాడని కొంత మంది బఫూన్‌లకు అనవసర ప్రాధాన్యం ఇస్తున్నాడని ఆరోపించి, ఈ విషయాలను సవివరంగా ముఖ్యమంత్రి చెవిన వేయమని సూచించాడట. అంతకు రెండు గంటల ముందే జరిగిన జిల్లా తెలుగుదేశం సమావేశంలో, నెల్లూరు తెలుగుదేశం పార్టీకి 'తల్లివైనా తండ్రివైనా నువ్వే నయ్యా' అంటూ ఆదాలను ఉద్దేశించి మాట్లాడిన రమేష్‌రెడ్డి, నాలుగు గోడల మధ్య అందుకు విరుద్ధంగా మాట్లాడటంతో, పాపం నారాయణయ్య, నోరు వెళ్లబెట్టాడట.

## నెల్లూరులో 'దేశం' రాజకీయం

రమేష్‌రెడ్డి వ్యతిరేక వర్గం నుంచి వై.వి.రామిరెడ్డి పార్టీ ఇన్‌ఛార్జి పదవి కోసం రేటు వేశాడు. ఇందుకు శ్రీధరకృష్ణారెడ్డి కూడా మద్దతిచ్చాడు. మంత్రి ఆదాల కూడా సరేనంటున్నాడని చెబుతున్నారు. అయితే ముఖ్యమంత్రి వై.వి. రామిరెడ్డి పేరును ఆమోదిస్తాడా లేదా అన్నదే సమస్య రమేష్‌రెడ్డి లాగానే. రామిరెడ్డి పేరును కూడా ఇన్‌ఛార్జి పదవికి పార్టీ నాయకత్వం ఆమోదించే అవకాశాలు ప్రస్తుతానికైతే శూన్యం. ఈ దశలో రెండు కోతులు, రొట్టె ముక్క కథలో పిల్లిని కాకపోతానా అన్న అభిప్రాయం శ్రీధరకృష్ణారెడ్డిలో వుంది.

పార్టీ ఇన్‌ఛార్జి పదవికి రమేష్‌రెడ్డిని కాదనుకుంటే, ఆ స్థాయిలో అన్ని విధాలా అర్హుడు వైటి. నాయుడు. అయితే ఆయనెందుకో ఇటీవల కాలంలో 'ప్యాసివ్' దశలో ఉన్నాడు. తన చుట్టూ ఒక గూడు అల్లుకొని, ఆ గూటిలో బ్రతుకుతున్నాడు. వివాదాలకు దూరంగా మసలుకుంటున్నారు. పదవి తనంతట తానే వరించి వచ్చినా వద్దని పారిపోయే ప్రయత్నంలో ఉన్నాడు. వై.టికి ముఖ్యమంత్రి దగ్గర చనువుంది. మంత్రి అండ ఉంది. అన్నీ ఉన్నా అల్లుడు నోట్లో శని అన్నట్టు తానై కోరివచ్చే అదృష్టాన్ని కాలదన్నే చపలత్వం కూడా ఉంది. నెల్లూరులో పార్టీ పెత్తనానికి ఒకరిని ఇన్‌ఛార్జిగా వేయకుండా ముగ్గురు, నలుగురు సభ్యులతో ఒక అడహాక్ కమిటీని కూడా వెయ్యాలన్న ప్రతిపాదన కూడా పార్టీ ఆలోచనలో ఉందంటున్నారు. ఈ తలనొప్పి అంతా ఎందుకనుకుంటే, ఇప్పుడు ఉండీ లేనట్టే ఉన్న 'పాలగోపాలుడినే' ఇన్‌ఛార్జి పదవిలో కొనసాగనించినా ఆశ్చర్యపో నవసరం లేదన్న వాదన కూడా వినిపిస్తోంది. తూటాలు నింపి తుపాకి ఇచ్చినా ట్రిగ్గర్ నొక్కడం తెలియని వ్యక్తి పాలగోపాలుడు.

## వరప్రసాద్

### మొదటి పేజీ కొరవ

శాంతాబయోటెక్ పెట్టుబడి కేవలం 15 కోట్ల రూపాయలు. అయినా ప్రపంచ కుబేరులైన ఇన్‌ఫోసిస్ నారాయణమూర్తి, విప్రో ప్రేమ్‌జిల కంటె మిన్నగా కమిటీ నుంచి గుర్తింపు పొందాడు. అందుకు కారణం ఆయన చేసిన ఉత్పత్తులు. స్వల్ప ఖర్చుతో పరిశోధనలు చేసి, హెపటైటిస్ బి వ్యాక్సిన్; క్యాన్సర్ చికిత్సకు మందు తయారు చేసినందుకు ఈ అవార్డు లభించింది. ఇదే క్యాన్సర్ మందుపై అమెరికన్ సంస్థలు జరిపిన పరిశోధనలకు కొన్ని వందల మిలియన్ డాలర్లు వ్యయమైనాయి.

వరప్రసాదంరెడ్డి - మన మాజీ కౌన్సిలర్ గండవరపు సేతురామిరెడ్డికి మేనల్లుడు; మాజీ ముఖ్యమంత్రి ఎన్. జనార్దనరెడ్డికి వియ్యంకుడు. ఆయనకు మా అభినందనలు.

# గ్రీన్‌గ్లోరీ పాపం, పోలీసుదొరలదే

నెల్లూరు ప్రజల డబ్బును మూట గట్టుకొని వెళ్లిన సంస్థల జాబితాలో తాజాగా గ్రీన్‌గ్లోరి సంస్థ కూడా చేరింది. గ్రీన్‌గ్లోరి కుంభకోణంలో పాప భారమంతా మన పోలీసు దొరలదే. ముఖ్యంగా మాజీ ఎస్పీ నరసయ్య గారిది. అదేదో తమ స్వంత సంస్థ అయినట్టు ప్రతి స్టేషన్‌కు ఇంతని వాటా నిర్ణయించి. జనాల్ని అదలించి బెదరించి, పీడించి ఈ సంస్థలో సభ్యులుగా చేర్పించారు. పోలీసు అధికారులు తమ భార్యల్ని కూడా ఇందులో సభ్యులుగా చేర్పి, వాటిని చూపించి ప్రజల్ని నమ్మించి నిలువునా వంచించారు. గ్రీన్‌గ్లోరి నిర్వాకాన్ని, ఇందులో పోలీసు అధికారుల పాత్రను జమీన్‌రైతు గతంలోనే ఎండగట్టింది. కానీ ఏం ప్రయోజనం. కంచే చేను మేస్తే చేయగలిగింది ఏముంది. సాక్షాత్తు కొందరు పోలీసు అధికారులే, పిండారీల మాదిరి జనాన్ని పీడించి డబ్బులు కట్టించారు. అత్తెసరు జీతాలతో బ్రతుకుతున్న కానిస్టేబుళ్ల చేత కూడా కట్టించారు. దాదాపు రెండున్నర కోట్లకు పైగా జిల్లాలో వసూలు చేశారు. ఇందులో కోటి రూపాయలు కమీషన్ల రూపంలో 'దొరలకు' ముట్టాయి. సంస్థలో వేలాది రూపాయలు సభ్యత్వం కట్టిన సభ్యులు లబోదిబో మంటున్నారు. ఒక్కో వ్యక్తి పదకొండు వేల రూపాయలు కట్టి మరో నలుగురి చేత ఇదే మొత్తం కట్టించే ఈ చైన్ లింక్ స్కీములో మొదట లాభపడింది పోలీసులే; నష్టపోయింది మాత్రం ప్రజలు. ఈ స్కీమ్‌లో ఎక్కువ మంది సభ్యులను చేర్పించిన ఘనత కావలి డిఎస్పీది. గ్రీన్ గ్లోరి సంస్థ స్టోన్‌హౌస్‌పేటలో నిర్వహించిన సభకు ఎస్పీ సి.వి. నరసయ్య ముఖ్యఅతిథిగా వెళ్లి దీనిపై ప్రజలకు నమ్మకం కలిగేలా చేశారు. నెల్లూరులో ఈ సంస్థ ప్రతినిధులమని రవిచంద్ర, యుగంధర్ అనే వ్యక్తులు చెప్పుకొనేవారు. ఈ అనామకుల ఆనవాళ్లు పోలీసులకు తెలుసు. కాకపోతే జరిగిన కుంభకోణంలో వాళ్లూ పాత్రధారులు కాబట్టి దొంగకు తేలుకుట్టినట్టు ఉండిపోయారు. వీరికి స్టోన్‌హౌస్‌పేటలోని వైశ్య ప్రముఖులు, ఒక వైశ్య న్యాయవాది మద్దతిచ్చారు.

## కంచే చేను మేసింది ఆదుకొనేవారెవరు

గ్రీన్‌గ్లోరి నిర్వాహకులే ఇటీవల వెబ్‌సైట్‌లో స్థలం అమ్ముతామంటూ అమాయకుల్ని వంచించి లక్షలు కాజేశారట. నెల్లూరులో ఈ మధ్య బోర్డు తిప్పేసిన ఫైనాన్స్ సంస్థలన్నింటి వద్ద పోలీసు 'పెద్దలు' పెద్ద మొత్తంలో లంచాలు మెంగి వారికి అండగా నిలబడ్డారు. ఫైనాన్స్ సంస్థల వంచన విషయాన్ని ఇటీవల జరిగిన శాసనసభ సమావేశాల్లో నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ప్రస్తావించారు. దీనికి హోం మంత్రి దేవేంద్రగౌడ్ సమాధానం చెబుతూ ఈ వ్యవహారంపై సిబిసిఐడి దర్యాప్తు చేయిస్తానన్నారు. ఈ దర్యాప్తు సక్రమ పద్ధతిలో జరిగితే ఈ వ్యవహారంలో పలువురు పోలీసు అధికారులే దోషులుగా నిలబడడం ఖాయం.

## సణుగుడు

2వ పేజీ తరువాయి

బొమ్మలు తమ ఇష్టం వచ్చినట్లు ఆడుతున్నాయి.

పదకొండు మందీ ఎవరికి వారు పెద్దలు; ఇంక ఎవరు చెప్పినమాట ఎవరు వింటారు? చెప్పేవాడు లేడు. చెప్పించుకునేవాడు లేడు. ఫలితం - ఇప్పటి పరిస్థితి. ప్రజలలో పార్టీ పట్ల అభిమానం పెరుగుతున్న తరుణంలో ఈ దుస్థితి ఏర్పడడం విచారకరం. నాయకులు లేని పార్టీ చుక్కాని లేని నావ ఒకటే - ఎటు పోతాయో తెలియదు; ఎక్కడ తేలుతాయో తెలియదు. నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి చాలా కాలం, మాగుంట సుబ్బరామరెడ్డి కొంత కాలం జిల్లా నాయకత్వంలో పోటీ పరిస్థితి కల్పించారు. అప్పుడు అందరూ అలర్ట్‌గా వుండినారు. ఇప్పుడు పోటీ లేదు. గుత్తాధిపత్యమూ లేదు. టెన్షన్ వుంటేనే రాజకీయాలలో రంజు!

ఏది ఏమైనా ఈ పరిస్థితి మంచిది కాదు; జిల్లాలో కాంగ్రెస్ పార్టీని సమిష్టిగా నడిపించడానికి ఎవరో ఒకరు ప్రయత్నించాలి; ఈ పదకొండు మర్రిచెట్ల క్రిందా కొత్త మొలకెత్తడానికి ఎవరో ఒకరు ప్రోత్సాహం ఇవ్వాలి. లేకుంటే పార్టీ నిర్జీవమై పోతుంది; నిర్వీర్యమౌతుంది.

***

జగదేవిపేట పెద్ద రైతు జక్కా రంగారెడ్డి జిల్లాలో భూస్వామ్య వ్యవస్థకు చివరి సంకేతం వలె వుండినారు. ఇందుకూరుపేట గ్రామాల వారికి ఆయన మరణం ఒక చెప్పలేని లోపం! రంగారెడ్డి గారు నిజానికి పెద్ద భూస్వామి ఏమీ కాదు; మధ్యతరగతి రైతు మాత్రమే. కాని భారీ విగ్రహం, గంభీరమైన కంఠం. చివరి దశలో తన సంతానం ఆర్జించిన సిరిసంపదలు ఆయనలో భూస్వామ్య సంకేతాలు సంతరించి పెట్టాయి. గూడూరు, కోవూరులకు, నెల్లూరు జిల్లా భూస్వాములకు ఒక తేడా వుంది. వీరు కష్టజీవులు. విలాసవంత జీవనానికి దూరంగా వుండేవారు; సామాన్యులకు సన్నిహితులు. మనకు తెలిసిన భూస్వామ్య వ్యవస్థ సంకేతం - కూకటి కోదండరామిరెడ్డిది! ఆరు నూరైనా నూరు ఆరైనా ఆయన ప్రతిదినం తన కమతాలన్నీ తిరిగి వచ్చేవారు. ఆ తర్వాత గునుపాటి రామచంద్రారెడ్డిగారు; తన కుటుంబ సభ్యులంతా హైదరాబాదు నగరంలో ఇంద్రభోగాలతో తులతూగుతున్నా, తనకు అందుకు స్తోమతవున్నా - నగటు రైతు వలె పెసల మానూలు కల్లంలోనూ నిలబడి వుండేవాడు. వ్యవసాయం అంటే ఆయనకు అంత మక్కువ; భూమి అంటే ప్రీతి. కాలువకు సకాలంలో నీళ్లు వదలకుంటే పిడుగ్గుడి ఇంజనీర్లపైన పడి కరిచేవాడు. సాయంత్రం 4 గంటలకు సరిగ్గా ఇందుకూరుపేట రోడ్డులో ఆయన కారు కన్పడేది; మోకాళ్లు వంగకపోయినా ఈ మామూలు క్రమం మాత్రం చివరి వరకు తప్పలేదు. వారిద్దరి తర్వాత అంతటి రైతు పెద్దగా గడిపినవాడు - జక్కా రంగారెడ్డి. తనకు రైతు పెద్దరికం ఆపాదించి, ఎవరైనా చిన్న రైతులు నీళ్ల సమస్యతోనో, కరెంట్ సమస్యతోనో తన వద్దకు వస్తే ఆయనకు ఎంత సంతోషమో!

రంగారెడ్డి గారి జీవితం ధన్యమైనది. జిల్లా ఒక అతిపెద్ద సంపన్న కుటుంబ సృష్టికి మూలకారకుడుగా గుర్తింపు పొందగల్గాడు. ఒకప్పుడు జిల్లాలో కూకటి, వరగలి, సిద్ధవరప్పు, రేబాల, దొడ్ల, బెజవాడ కుటుంబాలు జమీందార్ల వలె వెలిగిపోయాయి. ఇప్పుడు వారి అచూకీ కూడా లేదు. రెండవ తరంలో దొడ్ల సుబ్బారెడ్డి, గునుపాటి రామచంద్రారెడ్డి, తిక్కవరపు సుబ్బరామిరెడ్డి కుటుంబాలు వెలుగులోకి వచ్చాయి. కాని వారూ నెల్లూరుతో సంపర్కం తగ్గించుకొన్నారు. గునుపాటి సోదరులైతే నెల్లూరుకు రావడమే మానుకున్నారు. పెళ్లిళ్లు, పండుగలలో సైతం హాజరు లేరు. ఇప్పుడు నెల్లూరులో ప్రముఖంగా కన్పిస్తున్న సంపన్న కుటుంబం జక్కా రంగారెడ్డిది మాత్రమే! జె.కె.రెడ్డి, జె.ఎస్.రెడ్డి, ఆదాల రాఘవరెడ్డి, ఆదాల ప్రభాకరరెడ్డి తదితరులంతా తన కళ్ల ముందు ఆకాశమంతెత్తుకు ఎదగడం చూడగల్గాడు; ఒక మధ్యతరగతి రైతుకు ఎంత ఆనందం కల్గించే విషయమిది? అంతకంటే భాగ్యం ఇంకేమి కావాలి?*

## వేడుకలు

6వ పేజీ తరువాయి

సహజనటి విజయశాంతి కళాబంధు, ప్రజాబంధు బిరుదులకు మించిన అరుదైన వ్యక్తి సుబ్బరామిరెడ్డి అని పేర్కొనింది.

సుబ్బరామిరెడ్డి జన్మదినోత్సవ వేడుక సభను చూడను ఇసుకేస్తే రాలని జనం వచ్చారు. సభను వంశీరామరాజు, డిసిహెచ్. తిరుపతిరాజు, డి. శంకరరావు, చెరువు ఆంజనేయులు లోటుపాట్లకు తావివ్వక నిర్వహించారు.

సుబ్బరామిరెడ్డి ఎవరో అయితే మనం పట్టించుకోనక్కరలేదు. ఆయన మన నెల్లూరీయుడు. పరాయి గడ్డ విశాఖపట్టణంలోనే కాదు, దేశం నలుమూలల ఎందరో ప్రముఖులకు ఆత్మబంధువైన సుబ్బరామిరెడ్డి బహుముఖ వ్యక్తిత్వాన్ని స్వంత జిల్లా వాసులకు తెలియచెప్పాలనే ఈ విశేషాలను అందించాం. *



ఎందరికో నీడ ఇచ్చారు, పండ్లు ఇచ్చి ఆకలి తీర్చారు. కృతజ్ఞత అనేది మనిషికి వుందా?

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ తరువాయి

టౌన్‌బస్సుల వేగానికి ఎవరూ కళ్లెం వేయలేక పోతున్నారు.

### సోమిరెడ్డి రాధాకృష్ణారెడ్డి మరణం

సర్వేపల్లి శాసనసభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి పినతండ్రి రాధాకృష్ణారెడ్డి 26తేది రావూరువారి కండ్రిగలో కన్నుమూశారు. రాధాకృష్ణారెడ్డి పాతతరం రాజకీయవేత్త, కల్లాకపటం లేని మనిషి. రాధాకృష్ణారెడ్డి కుటుంబానికి మా సానుభూతి.

* * *

## జిల్లావార్తలు

5వ పేజీ తరువాయి

లు అడవులు వీధి గ్రామాలకు రాక తప్పదు. బసినేనిపల్లి అడవి నుంచి శ్రీరామ కోన అడవులు దగ్గరగా వుండడం వల్ల వీటిపైనా పోలీసులు కన్నేసి ఉంచడం అవసరం. పోలీసులకు సవాల్ విసిరిన దొంగలను పట్టుకోలేకపోతే ఆ శాఖ పరువు దిగజారడం ఖాయం.

### సమస్యల ఉచ్చులో బ్రిడ్జి స్కూలు

బుచ్చిరెడ్డిపాళెం పెద్దూరులో ఏర్పాటు చేసిన బాలికల బ్రిడ్జి కోర్సు పాఠశాల అనేక సమస్యలతో అల్లాడుతుంది. అధికారులు, రాజకీయ నాయకులు పాఠశాల ప్రారంభ సమయంలో చూపిన చొరవ నేడు కనపర్చడం లేదు. ప్రస్తుతం ఈ కోర్సు నడుపుతున్న అద్దె భవనంలో బాలికలకు కనీస వసతులు లేకపోవడంతో విద్యార్థినులు పలు ఇబ్బందులకు గురవుతున్నారు. 250 మంది విద్యార్థినులను ఒకేహాలులో బందెల దొడ్డిలో తోలినట్లు తోలడంతో విద్యార్థినులు తీవ్ర అసంతృప్తికి లోనవుతున్నారు. ఈ హాలులో కనీసం పార్టిషన్లు కూడా చేయకపోవడం విశేషం. ఇక ప్రతి నిమిషం అవసరమయ్యే నీటి వసతి కూడా అరకొరగా ఉంది. కరెంట్ పోతే విద్యార్థినులు నీళ్లకోసం బక్కెట్లతో రోడ్డు మీదకు రావాల్సిన పరిస్థితి వుంది. మరుగు దొడ్ల సంగతి సరేసరి. ప్రతినిత్యం వాటిని శుభ్రం చేయించక పోవడంతో కంపు కొడుతున్నాయి. మామూలుగా కరెంట్ పోతే ఇక విద్యార్థినులు చీకట్లో ఉండాల్సిందే. నెలకు దాదాపు 10వేల దాకా బాడుగ చెల్లిస్తున్నా భవన యజమాని సరియైన ఏర్పాట్లు చేయకపోవడం విచారకరం. ఈ భవన యజమాని అధికార పార్టీ నాయకుడు కావడంతో ఇక్కడి అధికారులు కూడా సౌకర్యాల విషయంలో మౌనంగా వున్నారనే విమర్శ వుంది. జిల్లా కలెక్టర్ స్పందించి బుచ్చి బ్రిడ్జి కోర్సు చదివే విద్యార్థినులకు సరియైన ఏర్పాట్లు చేయాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది.

### గూడూరు రైతులను ఆదుకోవాలి

తెలుగు గంగ నీటిని స్వర్ణముఖి నదిలోనికి సమృద్ధిగా విడుదల చేసి గూడూరు డివిజన్ రైతాంగాన్ని ఆదుకోవాలని నరసరావుపేట ఎమ్మెల్యే నేదురుమల్లి జనార్ధనరెడ్డి ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. వాకాడులోని తన స్వగృహంలో విలేఖరులతో మాట్లాడుతూ గత సీజన్లో ప్రకృతి వైపరీత్యాలు, పంటలకు తెగుళ్లు వచ్చి రైతులు తీవ్రంగా నష్టపోయారు. తీవ్ర వర్షాభావం కారణంగా డివిజన్‌లో కరవు



జిల్లా అభివృద్ధి మండలి సమావేశంలో మాట్లాడుతున్న ఇన్‌ఛార్జి మంత్రి చిక్కాల రామచంద్రరావు. కూర్చొన్నవారిలో జెసి. రావత్, కలెక్టర్ ప్రదీప్‌కుమార్, జిల్లామంత్రి ఆదాల ప్రభాకర రెడ్డి వున్నారు.

పరిస్థితులు తాండవిస్తున్నాయి. ప్రభుత్వం సోమశిల జలాలను కె.పి. కెనాల్ ద్వారా స్వర్ణముఖిలోనికి కేవలం 200 క్యూసెక్కుల నీరు మాత్రమే విడుదల చేస్తుంది. అవి ఇంతవరకు నాయుడుపేట వరకు రాలేదు. కరవు పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని మరో 100 క్యూసెక్కుల నీరు అదనంగా వదలాలని సూచించారు. కండలేరు - పూండి కాల్వలకు అదనంగా నీటి విడుదలలో వెంకటగిరి నియోజకవర్గంలోని జంగాలపల్లి ప్రజలకు ముంపు ప్రమాదం ఏర్పడిందన్నారు. జంగాలపల్లి వద్ద కె.పి. కెనాల్ ఎత్తులో వుండడం, కాల్వ గట్లు అసంపూర్తిగా, లైనింగ్ పనులు మరమ్మత్తులు సరిగ్గా జరుగక పోవడం వల్ల ముంపు పరిస్థితి ఏర్పడిందన్నారు. ప్రజావ్యతిరేక కార్యక్రమాలను చేపడుతున్న రాష్ట్ర ప్రభుత్వం ఎన్నికలంటే భయపడుతుందని, పంచాయతీ ఎన్నికలు పెడుతుందనే నమ్మకం లేదని జనార్ధనరెడ్డి చెప్పారు. వెంకటగిరి ఎమ్మెల్యే రాజ్యలక్ష్మమ్మ, ఏఐసిసి సభ్యుడు పద్మనాభరెడ్డి కూడా ఈ సమావేశంలో పాల్గొన్నారు.

### గ్రామీణాభివృద్ధికి ప్రాముఖ్యత

ప్రజల భాగస్వామ్యం, వారి సహకారంతో గ్రామాలకు అభివృద్ధి పనుల్లో ఎక్కువ ప్రాముఖ్యత నిస్తున్నట్లు రాష్ట్ర సహకార శాఖామంత్రి చిక్కాల రామచంద్రరావు అన్నారు. బుచ్చి మండలం నాగమాంబపురంలో ఆదివారం జరిగిన ఒక కార్యక్రమంలో ఆయన ముఖ్యఅతిధిగా పాల్గొన్నారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ జిల్లాలో 18కోట్ల రూపాయల వ్యయంతో డ్రెయిన్ల అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టినట్లు చెప్పారు. రాష్ట్ర ప్రభుత్వం చేపట్టే ప్రతి అభివృద్ధి పథకంపై ప్రజలలో అవగాహన పెరగాలని అప్పుడే వాటికి లక్ష్యం నెరవేరు తుందన్నారు. ప్రతి చిన్న అంశాన్ని కాంగ్రెస్ రాజకీయం చేస్తున్నాదని, ఈ పద్ధతి మంచిది కాదని చెప్పారు. రాబోయే స్థానిక సంస్థ ఎన్నికల్లో కార్యకర్తలందరూ సమిష్టిగా కృషి చేసి పార్టీని గెలిపించాలని కోరారు. జిల్లా మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి మాట్లాడుతూ నాగమాంబపురంలో 4లక్షల రూపాయల మేర పంట కాలువల పనులు జరుగుతున్నాయని చెప్పారు. అంతకు ముందు మంత్రి నాగమాంబపురం మలిదేవి వాగు వద్ద 24లక్షలతో నిర్మించిన బ్రిడ్జిని ప్రారంభించారు. కార్యక్రమంలో గూడూరు, ఉదయగిరి ఎమ్మెల్యేలు బల్లి దుర్గాప్రసాద్, కంభం విజయరామిరెడ్డి, కావలి ఆర్డీఓ మస్తాన్‌రావు, ఇరిగేషన్ ఎస్ఈ. కృష్ణారెడ్డి, దేశం నాయకులు బీద రవిచంద్ర, గోవర్ధనరెడ్డి, టంగుటూరి మల్లారెడ్డి, మాజీ సర్పంచ్ అన్నారెడ్డి, రంగనాథం, రాధాకృష్ణారెడ్డి, హరిబాబు తదితరులు పాల్గొన్నారు.

### ప్రభుత్వ భూమిని ఆక్రమించిన ఉపసర్పంచ్

ఎంతో విలువ చేసే 20 ఎకరాల ప్రభుత్వ భూమిని తెలివిగా ఆక్రమించిన ఉపసర్పంచ్ వైనమిది. నెల్లూరు రూరల్ మండలం పొట్టెపాళెం ఉపసర్పంచ్ కందల రమణయ్యకు కొండ్లపూడి గ్రామం వద్ద గల అటవీ శాఖ భూమిపై కన్నుపడింది. ఆయన అనుచరులు కొంతమంది ఈ భూమిని ఆక్రమించినట్లు డ్రామా ఆడించి ఈ భూమిని తన స్వంతం చేసుకొన్నాడు. ఈ భూమి లక్షల విలువ చేస్తుంది. తమ భూమిని దురాక్రమించినా అటవీశాఖాధికార్లు పట్టీపట్టనట్లున్నారు. ఈ భూమిని పొట్టెపాళెంలో భూమిలేని నిరుపేదలకు పంచేలా కలెక్టర్ తగిన చర్యలు తీసుకోవాల్సి వుంది.

### గిట్టుబాటు ధర

5వ పేజీ తరువాయి

వున్న తిరుపతమ్మ తన నోటికొచ్చిన వారిని నిందితులని చెప్పడంతో కేసు పక్కదారి పట్టిపోయింది. దీన్ని గ్రహించిన పోలీసు ఉన్నతాధికార్లు విచారణాధికారిగా వున్న సిఐ శ్రీనివాసరావు నుండి ఈ కేసు విచారణ బాధ్యతలు నుంచి తప్పించి, కావలి డిఎస్పీకి అప్పగించారు. ఆయన తప్పిదాలు పునరావృతం కాకుండా పకడ్బందీగా కేసును విచారించడంతో అసలు దోషులు బయటపడ్డారు.

### ధన్యజీవి

5వ పేజీ తరువాయి

చూసేవాడని, రైతు సమస్యలపై తీవ్రంగా స్పందించేవారని అన్నారు. ఆయన మరణంతో సర్వేపల్లి నియోజకవర్గ రైతాంగం ఒక పెద్ద దిక్కుని కోల్పోయిందని ఆవేదన వ్యక్తం చేశారు.

నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి మాట్లాడుతూ, తన కొడుకు జె.కె.రెడ్డి రాజకీయ భవిష్యత్తును కూడా పణంగా పెట్టి రైతు సంక్షేమానికి నడుం కట్టిన మహనీయుడని రంగారెడ్డికి నివాళులర్పించారు.

## నెల్లూరు మునిసిపాలిటి వారి ప్రకటన

నెల్లూరు పట్టణములోని ఈ క్రింద సూచించిన ప్రాంతముల యందు మునిసిపాలిటి వారి అనుమతి పొందకుండా అనధికారపు లేఅవుటు వేసి యిండ్లప్లాట్లుగా అమ్ముచున్నారు.

| వ.నెం. | రియల్‌ఎస్టేటు యజమాని పేరు | ప్రాంతము | సర్వే నెంబర్లు |
|---|---|---|---|
| 1. | నెల్లూరు రియల్ ఎస్టేటు మార్కెటింగ్ విజయమహల్ గేటు ప్రమోటరు: శ్రీ యన్.సుబ్బరావు | విద్యానగర్ (హరనాథపురం వెనుకవైపు) | 1257, 1258,1323,1259 1260, 1262, 1261. నెల్లూరు బిట్-I |
| 2. | సింహపురి రియల్ ఎస్టేటు మార్కెటింగు, జె.యల్.నారాయణ కాంప్లెక్స్ మొదటి అంతస్థు గాంధి విగ్రహము వద్ద | నెల్లూరు కొండాయపాళెం రోడ్డు తూర్పుభాగము | 330, 329, 334, 351 కొండాయపాళెం గ్రామము. |
| 3. | తల్పగిరి రియల్ ఎస్టేటు ప్రమోటరు జె.యల్.నారాయణ | బాలాజీ. శ్రీవెన్యూ హరనాథపురం | 1264/భాగము. 1318, 1319 1320, నెల్లూరు బిట్-II |
| 4. | కె.వి.ఆర్ కన్‌స్ట్రక్షన్స్, రామమూర్తినగర్ సెంటర్, ప్రమోటర్ కె.బాలచంద్రారెడ్డి | కావేరి అవెన్యూ(కొండాయపాళెం రోడ్డు తూర్పు భాగము) గెజిటెడ్ ఆఫీసర్స్ లేఅవుటు ఎదురు. | 369, 370, 366, 367, 361 కొండాయపాళెం గ్రామము. |
| 5. | -డిటో- | కొండాయపాళెం రోడ్డునందలి ఇన్‌ఫ్యాన్ట్ జీసస్ స్కూలు ప్రాంతములోని అనధికారపు లేఅవుటు | 406/భాగము కొండాయపాళెం గ్రామము. |
| 6. | పల్లవ అవెన్యూ | ముత్తుకూరు రోడ్డుకు ఆనుకొని పోర్సింగ్ ఫ్యాక్టరీకి దక్షిణపు వైపు పల్లవ అవెన్యూ అనధికారపు లేఅవుటు | 1198, 1199 నెల్లూరు బిట్-I |
| 7. | -- | ఆమోదింపబడిన యల్.పి.నెం.9/90 దక్షిణమువైపున గల అనధికారపు లేఅవుటు | 1313, 1314,నెల్లూరు బిట్-II |
| 8. | బాలాజీకాలనీ | బాలాజీనగర్‌లోని వేణుగోపాలస్వామి ఆర్ట్స్ కాలేజి దక్షిణపు వైపునగల బాలాజీకాలనీ | 633, నెల్లూరుబిట్-II |
| 9. | -- | రాయపు హరిజనవాడ వద్దగల అనధికారపు లేఅవుటు | 420 భాగము, నెల్లూరు బిట్-II |
| 10. | -- | అగ్రికల్చరల్ మార్కెటు యార్డు ఎదురుగ నరుకూరు రోడ్డు ఆనుకొని రైసు మిల్లు, తూర్పు భాగమున యున్న అనధికారపు లేఅవుటు | జి.టి.పి.నెం.2/89 |
| 11. | -- | అపోలో హాస్పిటల్స్ వెనుకవైపు యున్న అనధికారపు లేఅవుటు | 276, 877 నెల్లూరు బిట్-II |
| 12. | -- | చింతారెడ్డిపాళెం రోడ్డుకు ఆనుకొని దక్షిణ వైపున యున్న అనధికారపు లేఅవుటు | 941, 943, 944 నెల్లూరుబిట్-II |
| 13. | గోమతినగర్, ప్రమోటర్స్: వి.చిన్నారెడ్డి, ఇ. జయరామిరెడ్డి | మిని బైపాసురోడ్డునకు ఆనుకొని గోమతి స్కూల్ వద్దగల గోమతినగర్ | 663, 669/భాగము నెల్లూరు బిట్-I |
| 14. | -- | చింతారెడ్డిపాళెం డొంక వద్దగల అనధికారపు లేఅవుటు | 825/భాగము నెల్లూరు బిట్-II |

ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీ చట్టం 1965లోని సెక్షన్ 185 ప్రకారం అనుమతిలేని లేఅవుట్లలో ప్లాటు కొనడం చట్టరీత్యా వ్యతిరేకము. సరిహద్దు రాళ్లను తొలగించబడతాయి. అంతేగాక చట్టపరమైన అభ్యంతరాలు లేవదీసినప్పుడు న్యాయపరమైన తగాదాలు ఏర్పడి భవన నిర్మాణాలకు జాప్యం అంతరాయం కలుగటయేగాక ప్రాసిక్యూషను కూడా చేయబడును. భవన నిర్మాణాల కొరకు ప్లానులు అనుమతింపబడవు. సదరు ప్లాట్ల యందలి భవన నిర్మాణాలు జరిగియున్న అవి చట్టరీత్యా తొలగింపబడును.

కనీస సౌకర్యాల కల్పనకు మునిసిపాలిటీ ఏ విధమైన బాధ్యత వహించదు. డ్రైనేజి వ్యవస్థ వీధి దీపాలు, సరైన రోడ్డు సౌకర్యాలు మరియు నీటి సరఫరాకు మునిసిపాలిటీ ఏ విధమైన బాధ్యత వహించదు. కావున అనధికారపు లేఅవుటు నందలి ప్లాట్లు కొనరాదని తెలుపడమైనది. పై ఎస్టేటు యజమానులు వారము రోజులలో లేఅవుటు మంజూరుకు తగిన ప్లాన్లు సమర్పించని యెడల వారిపై చట్టరీత్యా తగు చర్య తీసుకొనబడునని తెలియజేయడమైనది.

కె. వేమారెడ్డి, కమీషనరు, నెల్లూరు మునిసిపాలిటీ.

# తారల తగాదా నిర్మాతకు సరదా!

సినిమాలు విజయం సాధించే కొలది హీరోయిన్ల రేట్లు పెరగడమేకాని తగ్గడం వుండదు. కాని సిమ్రాన్ ఇటీవల తన పారితోషికాన్ని బాగా తగ్గించింది. దీనికి కారణం జ్యోతిక. ఇటీవల షూటింగ్ మొదలైన 'స్టార్' చిత్రంలో హీరోయిన్‌గా మొదట సిమ్రాన్‌ను బుక్ చేశారు. తర్వాత ఆమెను తొలగించి జ్యోతికను హీరోయిన్ అని ప్రకటించారు. కారణమడిగితే పారితోషికమన్నారు. దీంతో అగ్గిమీద గుగ్గిలమైన సిమ్రాన్ తన మేనేజర్‌తో నిర్మాతలు ఎంతిచ్చినా పరవాలేదు. జ్యోతికను బుక్ చేసిన ఆఫీసులకెళ్లి నేనే బుక్ అయ్యేలా చూడు అని హుకుం జారీ చేసిందట. దీంతో నిర్మాతలు కొత్త పథకం రచించారు. సిమ్రాన్‌ను తీసుకోవాలనుకొనేవారు ముందుగా జ్యోతికను బుక్ చేశామని ప్రచారం చేస్తున్నారు. దీంతో సిమ్రాన్ అడ్డుపడి పారితోషికం తగ్గించుకొంటుంది. సిమ్రాన్ వ్యవహారం పలువురు సీనియర్ హీరోయిన్లకు ప్రస్తుతం మింగుడు పడడం లేదు.

## సిమ్రాన్, జ్యోతిక జుట్లు పట్టుకొంటున్నారు!

## దేవదాసులో పార్వతిగా మాధురీ దీక్షిత్

సంజయ్ లీలా బన్సాలీ హిందీలో తీస్తున్న దేవదాసు చిత్రంలో గతంలో చంద్రముఖిగా మాధురీ దీక్షిత్ నటిస్తుందని ప్రకటించారు. కాని చిత్రం సెట్స్ పైకి వచ్చాక పాత్రలు మారిపోయాయి. పార్వతిగా మాధురీ దీక్షిత్, చంద్రముఖిగా ఐశ్వర్యారాయ్ నటిస్తున్నారు. దీనికి దర్శకుడు బన్సాలీ కారణం చెబుతూ 'పారు' పాత్ర నటన చూపించేందుకు అనువైన పాత్ర. దీనికి మాధురీ దీక్షిత్ అయితే న్యాయం చేయగలరని మార్పు. ఐశ్వర్యారాయ్ కున్న డాన్స్‌టెలెంట్‌ను బట్టి ఆమెకు చంద్రముఖి పాత్ర బెస్ట్ అన్నారు. పాత్ర మార్పుకు తానేమీ ఫీల్ కావడం లేదని మాధురీ దీక్షిత్ ప్రకటించింది.


నువ్వేకావాలి చిత్రంలో రిచా, తరుణ్

# మీనాకు ఇల్లరికం మొగుడు కావాలట!

మీనాకు పెళ్లికళ వచ్చేసింది. మీనా పెళ్లి ప్రసక్తి తెచ్చిన సన్నిహితుల దగ్గర ఆమె తల్లి రాజమల్లిక వాళ్లమ్మాయికి నచ్చే భర్తకు ఉండాల్సిన అర్హతల గూర్చి చెబుతోంది. వాటిలో ముఖ్యమైంది అల్లుడు ఇల్లరికానికి రావాలట. రెండవది పెళ్లయ్యాక కూడా మీనా నటిస్తుందట. ముందే కండీషన్లు పెడితే ఎలాగమ్మా అంటే అంత్య నిష్ఠూరం కన్నా ఆది నిష్ఠూరమే మేలు కదా అంటుంది. దీనికితోడు మాకు మీనా ఒక్కర్తే బిడ్డ. అన్ని విధాల నచ్చినవాడు, కండీషన్లకు ఒప్పుకున్న వాడికే ఇచ్చిచేస్తామంటుంది రాజమల్లిక.

## చెల్లికోసం బంగ్లాను అమ్మిన అక్క

తమిళ చిత్రాల్లో బిజీగా వున్నప్పుడు చెన్నైలోని కొట్టివాక్కంలో నగ్మా ఒక అత్యాధునిక బంగ్లాను కొనింది. ఈ మధ్య తమిళ చిత్రాల్లో నటిస్తున్న నగ్మా సోదరి జ్యోతిక ఈ బంగ్లాలో వుంటానని నగ్మాను సతాయించిందట. దీంతో నగ్మా ఈ బంగ్లాను అమ్మేసింది. అనంతరం చెల్లిని పిల్చి నేను బంగ్లా కొన్నాక పరిశ్రమలో, జీవితంలో ఎన్నో చేదు అనుభవాలు పొందాను. అవి నీవు పొందకూడదనే అమ్మినట్లు చెప్పేసరికి జ్యోతిక కన్నీళ్ల పర్యంతమై అక్కను గట్టిగా హత్తుకొందట. మొత్తానికి అవగాహన వున్న అక్కా - చెల్లెళ్లు!

## అమ్మ షరత్తులు

## భవిష్యత్తు మనచేతుల్లోలేదు

భవిష్యత్తు అనేది మన చేతుల్లో లేదంటుంది నటి సౌందర్య. అందుకే రేపు ఏం చేస్తే బాగుంటుంది? అని ఆలోచించకుండా ఇవాల్టి సంగతేమిటి? అనే తర్కిస్తానంది. అప్పుడప్పుడూ కంప్యూటర్స్, వీణ నేర్చుకోవాలని, మధ్యలో వదలివేసిన చదువు కొనసాగించుకోవాలని అనిపిస్తుంటుంది. కానీ అన్ని ఆ సమయానికి గుర్తుంటాయి. వీలుపడదు కాబట్టి ఆ తర్వాత వాటి గూర్చి ఆలోచించను. గతం మన చేతుల్లో లేదు. భవిష్యత్తు మన చేతులకు అందదు. మన చేతుల్లో వుండేది వర్తమానమే నంటుంది ఈ హీరోయిన్.

## శిష్యులతో సినిమాలు

దర్శకునిగా తన టైం బాగోలేక పోవడంతో తన స్వంత బ్యానర్ మద్రాస్ టాకీస్ ద్వారా తాను నిర్మాత అవతారమెత్తి మణిరత్నం చిత్రాలు రూపొందిస్తున్నారు. ఈ చిత్రాలకు తను దర్శకత్వం నెరపక తన శిష్యులకు ఛాన్స్ ఇస్తున్నారాయన. శిష్యుడు అయగం పెరుమాళ్ తీస్తున్న తాజా చిత్రం పేరు 'డుమ్ డుమ్ డుమ్'. ఈ చిత్రంలో మాధవన్, జ్యోతిక హీరో, హీరోయిన్లు. ఈ చిత్రం హాస్య చిత్రమని మణిరత్నం చెప్పారు.

# 'రాయలసీమ రామన్నచౌదరి' వెండితెరకు మరో సిరి

మోహన్‌బాబు తాజాగా నిర్మించిన "రాయలసీమ రామన్న చౌదరి" కథను ప్రముఖ తమిళ నటుడు రజనీకాంత్ తాను నటించి, నిర్మించదలచుకున్న చిత్రం కోసం వ్రాసుకున్నాడట. స్క్రీన్‌ప్లే కూడా ఆయనే తయారుచేసి పెట్టుకున్నాడట. ఆ సమయంలో, యమజాతకుడు, పోస్టుమాన్ చిత్రాలు నిర్మించి వెనుకబడ్డ తన చిరకాల మిత్రుడు మోహన్‌బాబును ముందుకు నెట్టేందుకుగా కథను, స్క్రీన్‌ప్లేను ఆయనకిచ్చాడట రజనీకాంత్. కథ, స్క్రీన్‌ప్లే ఇచ్చి వదిలేయకుండా ఆ చిత్రంలోని పాత్రలకు న్యాయం చేకూర్చగల దర్శకుడుగా సురేష్‌కృష్ణను రజనీకాంత్ ఎంపిక చేశారట. వీలు చేసుకొని చిత్రం షూటింగులను కూడా పర్యవేక్షించాడట. ఆ సమయంలో మంచి సలహాలు కూడా ఇచ్చాడట. చిత్రం పేరు కూడా ఆయనే నిర్ణయించాడట. చిత్రం కథ, స్క్రీన్‌ప్లేకు టైటిల్సులో తన పేరు వేయవద్దని తన నిర్మాణ సంస్థ "అరుణాచలం క్రియేషన్సు" పేరు వెయ్యమని చెప్పాడట. తన సొంత చిత్రంలా భావించి ఇంతగా విజయానికి తోడ్పడ్డాడంటే, మోహన్‌బాబు, రజనీకాంత్ స్నేహ బంధం ఎంత పవిత్రమైందో, బలమైందో అర్థమవుతూంది.

కథలో రామన్న చౌదరి పాత్రకు ప్రత్యేకించి తన కోసం కళా రూపం

చిత్రసమీక్ష
* * *
గ్రిద్దలూరు గోపాలరావు

కల్పించాడట రజనీకాంత్. నాస్తికుడుగాను, పరమ దుర్మార్గుడుగాను వుండే ఈ పాత్ర పరిస్థితుల ప్రభావం వల్ల ఆస్తికుడుగా అందరికీ ఆత్మీయుడుగా మారిపోతుంది. ఏ తరహా పాత్రలోనైనా, అది విలనీయంతో కూడినదైనా, హీరోయిజం ఇమిడినదైనా నేర్పుగా పోషించగల మోహన్‌బాబు, రామన్న చౌదరి పాత్రను రజనీకాంత్‌కు నచ్చే రీతిలో ప్రేక్షకులు మెచ్చే స్థాయిలో నటించాడు. యువకుడుగా కనిపించాలని రామన్న చౌదరి పెద్ద కుమారుడి పాత్రను కూడా నిర్వహించాడు. అది గుర్తింపు పొందలేదు. కథలోని సన్నివేశాలన్నీ మొదట్లో రజనీకాంత్‌ను ఆ తర్వాత మోహన్‌బాబును దృష్టిలో వుంచుకొని తీర్చబడ్డాయి. అందువల్ల సన్నివేశాల బలమంతా రామన్న చౌదరి పాత్రకే పరిమితమవుతుంది. మిగతా పాత్రలు నామ మాత్రంగా నిలుస్తాయి. చిత్రం మొదటి భాగమంతా రామన్న చౌదరి దురహంకారంతో ముడిపడుతుంది. అతనిలోని నాస్తికత్వంతో విర్రవీగుతుంది. రెండో భాగం రామన్నచౌదరి నాస్తికత్వం దైవబలం ముందు భస్మీపటలమవుతుంది. రాక్షసత్వం, మానవత్వంగా మారుతుంది. ఈ సన్నివేశాలన్నిటికి దర్శకుడు సురేష్‌కృష్ణ బలమైన రూపం

తరువాయి 11వ పేజీలో

# వీరప్పన్ వీరాభిమాని ఆలీఖాన్

హైదరాబాదు సినిమా వార్తలు

గంధపు చెక్కల స్మగ్లర్ వీరప్పన్, హీరో రాజ్‌కుమార్‌ను కిడ్నాప్ చేసి వున్న నేపథ్యంలో అన్ని భాషల సినీ నటులు, కన్నడ కంఠీరవను విడుదల చేయాలని కోరుతున్నారు. కాని పలు తెలుగు చిత్రాల్లో విలన్‌గా నటించిన మన్సూర్ అలిఖాన్ అందుకు విరుద్ధంగా మాట్లాడి అందర్నీ ఆశ్చర్యపర్చారు. వీరప్పన్ తమిళ ప్రజల పాలిట నిజమైన హీరో. ఆయన అడవులు వీడి బయటకు వచ్చి రాజకీయ పార్టీ పెడితే అందులో చేరే మొదటి వ్యక్తిని నేనే! వీరప్పన్ తమిళుల కోసం ఒక రాజకీయ పార్టీ పెట్టాలని అలీఖాన్ సూచించాడు. గతంలో వీరప్పన్ పాత్రను పోషించిన అలీఖాన్‌ను నిజంగానే వీరప్పన్ పూనినట్లున్నాడు.

## హుషారు తగ్గని అల్లు

డెబ్బైయ్యవ పడిలో పడినా అల్లు రామలింగయ్యకు ఉత్సాహం ఏ మాత్రం తగ్గడం లేదు. ఈ మధ్యే ఆయన దేవుళ్లు చిత్రంలో ఒక పాటకు డ్యాన్స్ చేశారు. ఇంత వయస్సులోనూ ఇంకా ఎలా డాన్స్ చేయగల్గుతున్నారని ఆయన్ను అడిగాను. నాకు వెండితెరపై విపరీతమైన అభిమానం. ప్రాణమున్నంత వరకు ఇదే విధంగా నటిస్తుంటానని చెప్పారాయన.

## మా ఆయన్ను చూడక వుండలేక పోతున్నాను

పెళ్లి చేసుకొని అమెరికా వెళ్లిపోయిన భానుప్రియ మళ్లీ తిరిగి వచ్చి చిత్రాల్లో నటిస్తుంది. నాకు నటనపై వున్న ఆసక్తి, మక్కువ చూసి నేను మళ్లీ ఇండియా రావడానికి మా ఆయన ఒప్పుకొన్నారు. ఇక్కడికి వచ్చాక తమిళం, తెలుగు సినిమాలలో టి.వి. సీరియల్స్‌లో బిజీ అయిపొయ్యాను. రెండు నెలలకొకసారి వెళ్లి మూడు రోజుల పాటు అమెరికాలో వుండి వస్తున్నాను. ఆయన్ను చూడడానికి వీలవ్వని రెండు నెలలూ రోజూ టెలిఫోన్‌లో మాట్లాడుతాను. ఫోన్ చేసినా ఆయన్ను ఎప్పుడు చూద్దామా అని ప్రతిరోజూ అనిపిస్తుంది. 'దూరమైనకొలదీ పెరుగును అనురాగం' అంటారు చూడండి... అది ఇదేనేమో అంది భానుప్రియ.

## వెండితెరపై మళ్లీ రుచిత

జాబిలమ్మ పెళ్లి, దేవుడు చిత్రంలో అందాలను ఆరబోసిన రుచితా ప్రసాద్ రెండేళ్లపాటు ఎవరికీ కనిపించక ఏటో వెళ్లిపోయింది. మళ్లీ 'నేస్తం వస్తావా' నేరు వద్దనియాతరువాయి 11వ పేజీలో

# వారఫలాలు

30-9-2000తేది నుండి 6-10-2000తేది వరకు వృషభంలో వక్ర శని, గురువు; మిధునంలో రాహువు; సింహంలో కుజుడు; కన్యలో రవి; తులలో బుధ, శుక్రులు; ధనుస్సులో కేతువు; తుల, వృశ్చిక, ధనుస్సులలో చంద్రుడు.

## మేషం
(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

ఈ రాశి వారికి ఆదాయం బాగుంటుంది. కుటుంబంలో బిడ్డలకు, తండ్రివర్గ బంధువులకు ఆరోగ్యం సరిగా ఉండదు. సొంత పనులు, అధికార పనులు సక్రమంగా జరిగిపోతాయి. ఆస్తి సమస్యలు, బాకీలు పరిష్కారం వైపు వస్తాయి. విద్యాప్రగతి బాగుంటుంది. కండర నరాల సంబంధమైన రుగ్మతలు బాగుండి బాధిస్తాయి. స్థిరాస్తుల కొనుగోలు ప్రయత్నాలు జరుగుతాయి. ఉద్యోగులు అధికారుల సహాయం పొందుతారు.

## వృషభం
(కృత్తిక2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

ఆదాయం బాగుంటుంది. మీ పనులకు మిత్రులు సహాయపడతారు. వారాంతంలో అదనపు ఖర్చులుంటాయి. గౌరవ ప్రతిష్ఠలు బాగుంటాయి. ప్రముఖుల సందర్శన, పెద్దల అనుకూలత బాగుండి పనులు జరుగుతాయి. ఆరోగ్య భావం సరిగా ఉండదు. దైవ కార్యాలలో పాల్గొంటారు. ఉద్యోగ అవకాశాలు బాగుంటాయి. బాకీల వసూలు జరుగదు.

## మిధునం
(మృగశిర 3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

ఆదాయం బాగుంటుంది. తాత్కాలిక ఖర్చులు కూడ ఎక్కువగా ఉంటాయి. డబ్బు వ్యవహారాలు పరిష్కారానికి వస్తాయి. వ్యాపార, వ్యవసాయ పెట్టుబడులకు అవకాశాలు లభిస్తాయి. ఆరోగ్యం సరిగా ఉండదు. ఉద్యోగ నిర్వహణలో జాగ్రత్తపడాలి. సాంకేతిక శాస్త్ర రంగాల వారికి ఉపాధి అవకాశాలు బాగుంటాయి.

## కర్కాటకం
(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

కుటుంబ సభ్యులతో సన్నిహితులతో చిన్న చిన్న అభిప్రాయ భేదాలుంటాయి. ఉద్యోగార్థులకు మంచి అవకాశాలు, స్థానమార్పులు, అనుకోని ప్రయాణాలుంటాయి. వారం చివర కొద్దిపాటి అనారోగ్యం, బంధువర్గం వారి నుండి సహాయం పొందుట, అనుకున్న పనులు జరిగి పోవుట, డబ్బు రూపంలో ఇతరులకు సహాయ మందించడం జరుగును. ఆర్థికపరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది.

## సింహం
(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

కార్యనిర్వహణ సామర్థ్యం బాగుంటుంది. కుటుంబ సౌఖ్యం, ఇతరుల సహకారం, అధికారుల మన్నన బాగుంటుంది. ఉద్యోగ లాభం ఉంటుంది. ఉద్యోగ చలనం కలుగవచ్చును. ధైర్యంగా నిర్ణయాలు తీసుకొంటారు. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం బాగుంటుంది. కొత్త వ్యాపార పెట్టుబడులకు అవకాశాలుంటాయి. శుభకార్య నిర్ణయాలలో జాప్యం ఉంటుంది. విద్యార్థులకు ప్రగతి బాగుంటుంది. దైవ కార్యాలలో, శుభకార్యాలలో పాల్గొంటారు. రాజకీయ వర్గాల వారికి పనులు జరగడం, పలుకుబడి బాగుంటుంది.

## కన్య
(ఉత్తర 2, 3, 4 పాదాలు; హస్త; చిత్త 1,2 పాదాలు)

ఈ రాశి వారికి ఆర్థికస్థితి బాగుంటుంది. ఆరోగ్య విషయంలో జాగ్రత్త వహించాలి. కుటుంబ పెద్దలకు అనారోగ్యం కలుగుతుంది. అనుకున్న పనులలో ఆలస్యం జరుగుతుంది. శుభకార్యాల నిర్ణయం జరుగుతుంది

### పంచాంగం

పండుగలు
తేది 2 సోమవారం గాంధీ జయంతి
తేది 4 బుధవారం సరస్వతీ పూజ.
తేది 5 గురువారం దుర్గాష్టమి
తేది 6 శుక్రవారం మహర్నవమి
తేది 7 శనివారం విజయదశమి

సెప్టెంబరు తిథులు
ఆశ్వయుజ శుక్ల
తేది 30శని తదియ రా10.45గం.వ

అక్టోబరు తిథులు
తేది 1 ఆది చతుర్థి రా10.58గం.వ
తేది 2సోమ పంచమిరా 11.45 గం.వ
తేది 3మంగళ షష్ఠిరా 12.55 గం.వ
తేది 4బుధ సప్తమి రా 2.25 గం.వ
తేది 5 బేస్త అష్టమి రా 4.25 గం.వ
తేది 6 శుక్ర నవమి పూర్తిగ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.

## తుల
(చిత్ర 3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

ఈ రాశి వారికి ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. కాని అనవసర ఖర్చులు తప్పవు. సొంత పనులు, ఉద్యోగ పనులలో విజయం, అనుకూలత బాగుంటుంది. మిత్రుల, అధికారుల సహకారం బాగుంటుంది. విలువైన వస్తువులు కొనడం, కొత్త వ్యక్తుల పరిచయాలు బాగుంటాయి. శాస్త్ర, సాంకేతిక రంగాల వారికి ఉద్యోగాలు లభించవచ్చును. ప్రభుత్వ రుణాలు, రావలసిన బాకీలకు గట్టి ప్రయత్నం అవసరం.

## వృశ్చికం
(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఆర్థిక సమస్యలుంటాయి. వృత్తి, వ్యాపారాలలో ఆదాయం సరిగా ఉండదు. కుటుంబ సభ్యులకు అనారోగ్య బాధలుంటాయి. అనుకోని ఖర్చులు పైనబడి ఇబ్బందులు పడతారు. స్థిరాస్తుల వ్యవహారాలలో రాజీ మార్గాలు లభిస్తాయి. ఉద్యోగులు పనిభారంతో శ్రమపడినా అధికారుల సహాయం పొందుతారు. రాజకీయ వర్గాలకు పలుకుబడి, పరపతి బాగుంటుంది. ఉద్యోగార్థులకు అవకాశాలు లభిస్తాయి.

## ధనుస్సు
(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

వృత్తి, వ్యాపారాలలో కొత్త అవకాశాలు లభిస్తాయి. జాగ్రత్తగా వ్యవహరించవలసి వుంటుంది. సొంత పనులు, ప్రభుత్వ పనులు సవ్యంగా జరిగిపోతాయి. ఈ రాశి వారికి ఆదాయం సంతృప్తికరంగాఉంటుంది. పలుకుబడి కోసం ఖర్చులు అదనంగా పెట్టవలసి వస్తుంది. క్రయవిక్రయాలు నిర్ణయించి లాభం పొందుతారు. ఉద్యోగులకు పనిభారం పెరుగుతుంది. అధికారుల పూర్తి సహాయం పొందుతారు. రావలసిన బాకీలు కొంత వరకు లభిస్తాయి. ఆకస్మిక ప్రయాణాలు, శుభకార్యాలలో పాల్గొనడం, విద్యాప్రగతి బాగుంటుంది.

## మకరం
(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

మానసికంగా పరిస్థితుల నెదుర్కొనే ధైర్యం ఉంటుంది. వృత్తి, వాణిజ్య రంగాలలో ఆదాయం పెరుగుతుంది. మీరు పెట్టిన పెట్టుబడులపైన రాబడి ఉంటుంది. అప్పులు, ఆస్తి వ్యవహారాలు కొనసాగుతాయి. అనుకున్న పనులు ఆటంకాలతో కొనసాగుతాయి. కుటుంబ సభ్యులకు కొద్దిపాటి అనారోగ్యం ఉండవచ్చును.

## కుంభం
(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

వ్యాపార వృద్ధి, ఆస్తి అభివృద్ధికి అవకాశాలు లభిస్తాయి. అనవసరమైన తగాదాలలో చిక్కుకొనకుండా జాగ్రత్తపడాలి. తండ్రివర్గ బంధువుల సమస్యలు తెలుస్తాయి. ఆరోగ్య విషయంలో జాగ్రత్త వహించాలి. ఉద్యోగులకు శ్రమ, అధికారుల వత్తిడి తప్పవు.

## మీనం
(పూర్వాభాద్ర 4పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఆర్థిక సమస్యలు కొద్దిగ ఎక్కువగా ఉంటాయి. అవసరాలకు రుణం చేయవలసి రావచ్చును. ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోవాలి. బంధువర్గాల వల్ల సమస్యలు బాధిస్తాయి. స్థిర నిర్ణయాలు తీసుకోవలేరు. వ్యాపార, వ్యవసాయ రంగాలు మందకొడిగా ఉంటాయి. విద్యార్థులు చదువులో శ్రద్ధ చూపాలి.

# జనవాణి

3వ పేజీ కొరవ

భారత మహిళా లోకానికి వన్నెతెచ్చిన మల్లీశ్వరికి అభినందనలు.

నెల్లూరు — ఎస్.రాజ్యలక్ష్మి, ఎస్. శ్రీనివాసులు

### పట్టపగలు వీధిలైట్లు

నెల్లూరు దర్గామిట్ట ప్రాంతంలోని పలు వీధుల్లో పగలు, రాత్రి తేడా లేకుండా వీధి దీపాలు వెలుగుతున్నాయి. అసలే విద్యుత్ రేట్లు పెరిగిన ఈ రోజుల్లో ఈ అనవసర వ్యయమెందుకో అర్థం కావడం లేదు. మునిసిపల్ ఉద్యోగుల్లో క్రమశిక్షణ బాగా లోపించింది. ప్రతి ఉద్యోగి పలుకుబడి పలుకులు పలుకుతున్నారు. ఉన్నతాధికారుల పర్యవేక్షణ వుంటే ఈ విధంగా జరుగదు.

నెల్లూరు — నెల్లూరు బాబు



### న్యాయస్థానాలను ఆశ్రయించాలి

విద్యుత్ సంస్కరణలు, ఛార్జీల పెంపు, రాష్ట్ర ప్రభుత్వం ప్రపంచ బ్యాంకు ఆలోచనలకు లొబడి చేసిన విషయాలపై జమీన్‌రైతులో ప్రచురితమైన వార్త వాస్తవాలను బట్టబయలు చేసింది. వాస్తవాలను ఇంత వివరంగా ఏ పత్రికలోనూ ప్రకటించలేదు. విద్యుత్ ఛార్జీలను పెంపుదలను ప్రతిపక్ష పార్టీలు పోరాటం చేసి కూడా నిలువరించలేకపోయాయి. ఈ వ్యవహారాలన్నింటిపై విశ్వాసకులు ఎవరైనా న్యాయస్థానాలను ఆశ్రయించి ప్రభుత్వ మొండివైఖరిని నిలువరించాల్సి వుంది.

నెల్లూరు — వై. హనుమంతరావు

### ప్రాజెక్టులు పూర్తి చేయండి

కేంద్ర జలవనరుల మంత్రిత్వశాఖ ఇటీవల ఎనిమిది నీటిపారుదల ప్రాజెక్టులకు ఆమోదం తెలిపింది. ఇందులో మన రాష్ట్రానికి చెందిన వెలుగోడు ప్రాజెక్ట్ కూడా వుంది. కేవలం ప్రాజెక్ట్ ఆమోదం పొందితే సరిపోదు. ప్రాజెక్ట్‌ను పూర్తి చేయించాలి. జిల్లాలోని సోమశిల, కండలేరు ఎప్పటికి పూర్తి సామర్థ్యం గల ప్రాజెక్టులుగా తయారవుతాయో తెలియదు. సకాలంలో నీటిపారుదల ప్రాజెక్టులు పూర్తయితే వ్యవసాయ రంగం ఎంతో అభివృద్ధి చెందుతుంది. కేవలం కాగితాల మీదే ప్రాజెక్టులు అమలుకు నోచుకొంటే ప్రయోజనం శూన్యం.

నెల్లూరు — కె. గీతావాణి

### నల్లధనం రాబడితే అంతా వెలుగే!

ప్రస్తుతం ఆర్థిక ఇబ్బందులలో ప్రజలు, ప్రభుత్వాలు సతమతమై పోతున్నాయి. పట్టెడన్నం దొరకని స్థితిలో ఎందరో నిర్భాగ్యులుంటే, కోట్లకు కోట్లు లాకర్లలో పెట్టి ఎలా ఖర్చు చేయాలో తెలియని ప్రబుద్ధులు వున్నారు. క్రికెట్ ఆటగాళ్ల వద్ద ఒక రాష్ట్ర ప్రభుత్వ వార్షిక బడ్జెట్‌కు సరిపడా నల్లధనం వుందంటే ప్రభుత్వపాలసీల సృష్టికర్తలను ఏమనాలో అర్థం కావడం లేదు. ప్రభుత్వం ఏదో ఒక కార్యక్రమం చేపట్టి నల్ల ధనాన్ని వెలికితీసే చర్యలు చేపడితే దేశంలోని సవాలక్ష సమస్యలు పరిష్కారమవుతాయి.

వైస్రా — నలబోలు రామ్మోహనరెడ్డి

# 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

వారిచ్చిన లైసెన్సును బట్టి పై సంస్థవారి కాలపరిమితి ఇంకకొన్ని సంవత్సరములు జరిగిన గాని ముగియదు. ఆ సంస్థ వారి పాలనమును పరిశీలింతుమేని, సరియైన యంత్రములనుగాని పరికర సంపత్తినిగాని తెచ్చిపెట్టి పురజనుల దీప సౌకర్యములను పవర్ అండ్ లైటు వారు సమకూర్చిన వారు కారని స్పష్టమైనది. కావలసిన పవర్ స్టేషన్లను పరిపూర్ణముగా నిర్మించిన వారు కారు. వలసినంత విద్యుశ్శక్తిని తయారు చేయగలిగిన యంత్ర సంపత్తి చేకూర్చుకొనలేని వారైన హేతువున అన్నిచోట్లను దీపములు తుల్య తేజస్సుతో వెలుగుట అందరం చూచుచునేయున్నాం.

ఈ విషయమిట్లుండ, వీరు వసూలు చేయు ఛార్జీలు గమనింప దగియున్నవి. అంచుమించుగా యూనిటు 1-కి కొన్ని దమ్మిడీలు తక్కువగా ఒక్క రూపాయి పౌరుల యొద్ద పవర్ అండ్ లైటు వారు వసూలు చేయుచున్నారు.

### నెల్లూరు ముచ్చట్లు

#### డాక్టరు రామచంద్రారెడ్డికి మతిభ్రమణం

పాపం! ప్రతిభావంతుడైన, ప్రజలకు ఎక్కువగా వుపకరిస్తుండిన డాక్టర్ పుచ్చలపల్లి రామచంద్రారెడ్డికి తిరుగా మతిభ్రమణం రావడం, విధిన పోయేవారిపై దౌర్జన్యం జరపడం, తాను దెబ్బలు తినడం జరిగింది. ఇతనికి మతిభ్రమణంలో గూడా పేదల పట్ల ఎంత శ్రద్ధో చూడండి. మొన్న ఈ పిచ్చిలోనే ఠక్కర్ బాపా యానాది హాస్టల్ ప్రక్క ఒక గుడిసెలో అనారోగ్యంలో బాధపడుతున్న ఒక పేదవానికి తన వేలి వుంగరం యిచ్చి మందు తీసుకోమన్నాడట. ఉపకార జీవియైన ఈ డాక్టర్ గారికి మతి స్థిమితం కల్గించ వలసినదిగా భగవంతుని ప్రార్థిస్తున్నాం.

#### ఎలెక్ట్రిక్ బల్బులు

గవర్నమెంటు ధర నిర్ణయించింది. నెల్లూరు అంగళ్లలో స్టాకులు నిండిపోయి యున్నవి. కాని రిలీజు ఆర్డర్సు ఇంకా ఇవ్వలేదు. ప్రజలు పడే ఇబ్బందిని ఆఫీసర్లు గమనిస్తే బాగుంటుంది.

#### ఏసి రెడ్డి రాజీనామా

రాజకీయ బాధితుల సలహా సంఘ సభ్యత్వాన్నుండి రాజీనామా ఇచ్చారట. దువ్వూరు చెరువు పూర్తిగా బాధితులకు ఇచ్చి, సిద్ధిపురం 200 ఎకరాలు కూలీలకు ఇప్పించాలని తాను మద్రాసు వెళ్లి ప్రయత్నిస్తుండడం, ఆయనకు తెలియకుండా మీటింగుపెట్టి, సిద్ధిపురంలో 200 ఎకరాలు, దువ్వూరు చెరువు రాజకీయ బాధితులకివ్వ నిర్ణయించడం, అవి ఆయన అభిప్రాయానికి వ్యతిరేకం కావడం ఇవి రాజీనామా కారణాలు.

* * *

## నెల్లూరుసంగతులు

4వ పేజీ తరువాత

పంపుతున్నట్లు నోటులో వుంది. ఆంధ్రపత్రిక మూతపడి ఒకటిన్నర దశాబ్దానికి పైగా అయ్యింది. మార్కెట్‌లో లేని పత్రిక తాలూకు ప్రకటన 'అనుబంధం' శీర్షికలో పేర్కొంటూ డి.ఇ.ఓ. దీన్ని ఎక్కడికి పంపుతున్నారో? ఏదైన ప్రకటన మీద సంతకం చేసే ముందు ప్రకటనలో దానిలో ఏముందో చూడాల్సిన అవసరం డి.ఇ.ఓ.కు లేదా?

### స్టాండ్ సూపర్‌వైజర్లపై కానిస్టేబిల్ జులుం!

ఎస్‌పి పేరు చెప్పి స్టాండ్ సూపర్‌వైజర్ల నుంచి ప్రతినిత్యం లంచం డిమాండ్ చేస్తున్న జి.డి. కానిస్టేబిల్ వైనమిది. నెల్లూరు ఆర్టీసి బస్టాండ్ వద్ద ప్రైవేట్ బస్సులు వాటికి కేటాయించిన సమయంలో బయలు దేరడాన్ని పర్యవేక్షించను ముగ్గురు సూపర్‌వైజర్లున్నారు. సాయంత్రానికి ఒక్కొక్కరికి కూలీ రూపేణ వంద రూపాయలు వివిధ బస్సుల వాళ్లు ఇవ్వగా ముడుతుంది. పరిస్థితి ఇలా ఉండగా ట్రాఫిక్ ఎస్‌ఐ ఖాదర్‌బాషా వద్ద జి.డి. కానిస్టేబిల్‌గా పనిచేసే వాసుదేవరావు అనే కానిస్టేబిల్ ప్రతినిత్యం ఒక్కొక్క స్టాండ్ సూపర్‌వైజర్ తనకు 50 రూపాయలు లంచంగా ఇవ్వాలని సతాయిస్తున్నాడట. లేకుంటే చీకాకులు సృష్టిస్తానంటున్నాడట. ఇప్పటికే ఆర్టీసి బస్టాండ్ వద్ద డ్యూటీలో వుండే కానిస్టేబుళ్లకు ఉదయం టీ, టిఫిన్, మధ్యాహ్నభోజనం, సాయంత్రం టీ, టిఫిన్ వరకు అన్నీ బాధ్యతలు ప్రైవేట్ బస్సుల సిబ్బందే చూస్తున్నారట. ఇదివాలక తెండికి గడవని స్టాండ్ సూపర్‌వైజర్లను పీక్కొని తినడమేమిటి? ఖాదర్‌బాషా గారు మీ కానిస్టేబిల్‌ను కాస్త అదుపులో పెట్టుకోండి సార్!

### డాక్టర్ మల్లిఖార్జునరెడ్డికి సమ్మాన్ అవార్డు

గత ఐదేళ్ల నుంచి ఖచ్చితంగా ఆదాయపన్నును చెల్లించిన వారికి ఆదాయపన్నుశాఖ సమ్మాన్ అవార్డు పేర కొత్తగా సన్మానాలకు శ్రీకారం చుట్టింది. నెల్లూరులో తొలిసారిగా ఈ అవార్డులను చిన్న పిల్లల డాక్టర్ మల్లిఖార్జునరెడ్డి, ఎస్‌బిఐ డిప్యూటీ మేనేజర్ ఎస్. పెంచలయ్య, ప్రొవిజన్స్ నడిపే నాగరాజారావు అందుకున్నారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని 25తేది రంగనాయకుల పేటలోని సోమిశెట్టి కళ్యాణ మండపంలో ఆదాయపన్ను శాఖ ప్రత్యేక సభను నిర్వహించింది. దీనిలో ముఖ్యఅతిధిగా పాల్గొన్న ఆదాయపన్ను శాఖ సహాయ కమీషనర్ శ్రీధర్ మాట్లాడుతూ కేంద్ర ప్రభుత్వం ఆదాయపు పన్ను విభాగంలో 1/6 పథకాన్ని ప్రవేశపెట్టింది. టౌన్‌లో 1500 చదరపు అడుగుల విస్తీర్ణంగల సొంత లేదా అద్దె ఇంట్లో నివశిస్తున్న వారు ఈ పథకం పరిధిలోనికి వస్తారు. వీరు ఫారం నెం.2ని ప్రకారం రిటర్న్స్ దాఖలు చేసుకోవాలన్నారు. డిప్యూటీ కమీషనర్ బలరామదాను మాట్లాడుతూ బ్యాంక్ క్రెడిట్ కార్డు, టెలిఫోన్, సెల్యూలార్ ఫోన్ గల వాళ్లు కూడా ఫారం నెం.2ని ప్రకారం ఆదాయ వివరాలను వార్షిక ఆదాయంతో నిమిత్తం లేకుండా తమ శాఖకు రిటర్న్స్ దాఖలు చేసుకోవాలని బాంబు లాంటి విషయం పేల్చారు. ఈ కార్యక్రమానికి పెద్ద ఎత్తున ఆదాయపన్ను చెల్లించేవారు హాజరయ్యారు.

### వర్ధమానసమాజం సాహిత్య సభలు

వర్ధమాన సమాజం యాజమాన్యాన అక్టోబర్ 1, 2, 3 తేదుల్లో టౌన్‌హాల్‌లో సాహిత్య సభలు ఏర్పాటయ్యాయి. 1తేది పోతన మహాకవి జయంతి సభ జరుగుతుంది. డాక్టర్ కెవిఎస్. ఆచార్య, పోతన భాగవతం - భక్తితత్వంపై ఉపన్యసించి దొడ్ల శ్రీనివాసులురెడ్డి చేసే సన్మానాన్ని స్వీకరిస్తారు. 2తేది శ్రీనాథ మహాకవి జయంతి సభ జరుగుతుంది. ప్రొఫెసర్ కె. మలయవాసిని, శ్రీనాథుడు - స్త్రీపాత్ర చిత్రణ అనే అంశంపై మాట్లాడి, వి.నరేంద్రనాథరెడ్డి చేతుల మీదుగా సన్మానింపబడతారు. 3తేది మరుపూరు కోదండ రామిరెడ్డి 98వ జయంతి సభ పి.వి. రమణారెడ్డి అధ్యక్షతన జరుగుతుంది. డాక్టర్ సుమతీ నరేంద్ర, మరుపూరు వారి సాహిత్య సేవను గూర్చి ఉపన్యసించి మరుపూరు ట్రస్ట్ నిర్వాహకుల చేత సన్మానింపబడతారు. సాహిత్యాభిమానులను ఈ కార్యక్రమానికి తరలి రమ్మంటున్నారు సమాజం అధ్యక్షులు అగస్త్యరెడ్డి వెంకురెడ్డి.

### దళిత మహాసభ సమావేశం

ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ నెల్లూరు జిల్లా శాఖ సర్వసభ్య సమావేశం 24తేది సుబేదారుపేటలోని ఎబిఎం కాంపౌండ్‌లో జరిగింది. మహాసభ జిల్లా శాఖ కన్వీనర్ అరవ రామప్ప మాట్లాడుతూ దళిత మహాసభ ఆశయాలను జిల్లా నలుమూలల వ్యాపింప చేయడానికి సభ్యులు కృషి చేయాలన్నారు. దళిత నాయకుడు జ్యోతి చిన్నయ్య, దళిత విద్యార్థి సేన అధ్యక్షులు అరవ పూర్ణ ప్రకాష్, పట్టపు కోటయ్య, వైకుంఠ రామకృష్ణయ్య సమావేశంలో పాల్గొన్నారు. ఫల, పుష్ప విక్రేతల సంఘం ప్రధాన కార్యదర్శి లలితమ్మ వందన సమర్పణ చేశారు.

### ప్రొఫెషనల్ అడ్వాన్సుమెంట్ టెస్ట్

ఒకే క్యాడర్‌లో 10 సంవత్సరాల సర్వీసును పూర్తి చేసిన ఉపాధ్యాయులకు 17తేది జిల్లా స్థాయిలో ప్రొఫెషనల్ అడ్వాన్సుమెంట్ పరీక్ష నిర్వహిస్తామని డి.ఇ.ఓ. జయచంద్రకుమార్ చెప్పారు. "సెక్రటరీ టు ది కమీషనర్ ఫర్ గవర్నమెంట్ ఎగ్జామినేషన్స్" ఎ.పి. హైదరాబాద్ పేరిట 20 రూపాయల పరీక్ష ఫీజును ఎస్‌బిఐలో చెల్లించి, దరఖాస్తును 30తేదిలోగా తమ కార్యాలయంలో దాఖలు చేయమంటున్నారు.

### మల్లీశ్వరిని ఆదర్శంగా తీసుకోవాలి

సిడ్నీ ఒలింపిక్స్‌లో భారతదేశ ప్రతిష్టను నిలిపిన కరణం మల్లీశ్వరిని ఆదర్శంగా తీసుకొని క్రీడలపై యువతరం ఆసక్తిని పెంపొందించుకోవాలని జిల్లా కలెక్టర్ కె. ప్రవీణ్‌కుమార్ ఉద్బోధించారు. 23తేది సెయింట్ జోసఫ్ స్కూల్ ఆవరణలో జీవితభీమా సంస్థ 24వ జాతీయ స్థాయి టేబుల్ టెన్నిస్ టోర్నమెంటును జిల్లా కలెక్టర్ జ్యోతి వెలిగించి ప్రారంభించి, మాట్లాడారు. నేటి యువతరం కేబుల్ టి.విలు, ఇంటర్నెట్ కేఫ్‌లకు పరిమితమవు తున్నారు. క్రీడలపై ఆసక్తి పెంచుకొంటే ఆరోగ్యం వృద్ధి చెందడమే కాకుండా జీవన గమనంలో ఒడిదుడుకులు తట్టుకొనే శక్తి వస్తుందన్నారు. ఎల్‌ఐసి స్పోర్ట్స్ ఇన్‌ఛార్జ్ మిశ్రా, డివిజన్ మేనేజర్ ఆర్.గోపీనాథ్, మార్కెటింగ్ మేనేజర్ యం.కె. ఛుక్రా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ పోటీల్లో మహిళల విభాగంలో అవంతి సిన్హా, పురుషుల విభాగంలో ఆర్. రాజేష్‌లు విజయం సాధించారు.

### పూడికతీతను పర్యవేక్షించిన ఎమ్మెల్యే

నెల్లూరులో 6లక్షల 80వేల రూపాయలు వెచ్చించి చేస్తున్న కాలువల పూడికతీత పనులను ఎమ్మెల్యే వివేకానందరెడ్డి పర్యవేక్షించారు. ఫత్తేఖాన్‌పేటలోని వీవర్స్ కాలువ, రాయప్ప హరిజనవాడ కాలువ పనులను చూసి సంతృప్తిని వ్యక్తం చేశారు. ఈ పనులకు నిధులు మంజూరు చేయించిన ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి, జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్‌కు ఎమ్మెల్యే కృతజ్ఞతలు తెలియజేశారు. ఈ కార్యక్రమంలో మునిసిపల్ వైస్ ఛైర్మన్ సందానిబాష, మినీ ఛైర్మన్లు పిండి సురేష్, పుట్టా రామకృష్ణారెడ్డి, కౌన్సిలర్లు నావూరి శాంతమ్మ, పిట్ల చెంచులక్ష్మి తదితరులు పాల్గొన్నారు.

### ఉర్దుచదివే విద్యార్థులకు స్కాలర్ షిప్పులు

ఉర్దు బాషను చదివే విద్యార్థులకు స్కాలర్ షిప్పులు మంజూరయ్యాయి. వీటిని పొందగోరు విద్యార్థులు తమ కళాశాలలో లభ్యమయ్యే దరఖాస్తులను పూర్తి చేయాలి. వాటిని అక్టోబర్ 10తేదిలోగా షేక్. చాంద్‌బాషా, ఉర్దు అకాడమి డైరక్టర్, 17/343-5, బారకాస్, నెల్లూరు -1 చిరునామాకు పంపాలని కోరుతున్నారు.

### గ్రామ పరిపాలనాధికారి కప్పదాట్లు!

సింహపురి గ్రామ పరిపాలనాధికార్ల సంఘ అధ్యక్షునిగా వుండిన నెల్లూరుటౌన్ గ్రామ పరిపాలనాధికారి పి.గోపాల్‌రెడ్డి ఆ పదవికి రాజీనామా చేశారు. దేవళ్ల దశరథరామిరెడ్డి నేతృత్వంలోని ఎపి స్టేట్ గ్రామపరిపాలనాధికార్ల ఫెడరేషన్‌లో చేరుతున్నట్లు చెప్పారు. గోపాలరెడ్డిని భరించడం అంత సులభమా దశరథరామిరెడ్డిగారు?

---

## కసుర్లు

4వ పేజీ తరువాత

ప్రవాహ విషయమై సోమశిల అధికారులు ఖచ్చితమైన సమాచారాన్ని అందివ్వ లేదని ఆవేదన వ్యక్తం చేశారు. తెలుగు గంగ ప్రాజెక్ట్ పరిధిలో పనులు పూర్తి కాకుండానే తెలుగుగంగ సర్కిల్ కార్యాలయాన్ని ఎత్తివేయడం ధర్మం కాదని సర్వేపల్లి ఎమ్మెల్యే సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి చెప్పారు.

కరవుపై చర్చను వెంకటగిరి ఎమ్మెల్యే రాజ్యలక్ష్మమ్మ ప్రారంభించారు. నియోజకవర్గంలో 200 చెరువులు అధ్వాన్నస్థితిలో వున్నాయి. తెలుగుగంగ కాల్వ నియోజక వర్గంలో నుంచే వెళ్తుంది. కాని రైతులు చుక్క నీరు వినియోగించుకోను లేదు. బావులు, బోర్లు ఎండిపోయాయి. లిఫ్ట్ ఇరిగేషన్ ద్వారా తెలుగుగంగ నీటిని వాడుకొనే అవకాశం ఇవ్వాలన్నారు. ఉదయగిరి ఎమ్మెల్యే కంభం విజయరామిరెడ్డి మాట్లాడుతూ జిల్లాలో 46 మండలాలు కరవు బారిన పడినా విడుదలైన నిధులు స్వల్పమన్నారు. నిత్య కరువు ప్రాంతమైన కొండాపురానికి ఒక్క రూపాయి కరవు నిధులు ఇవ్వలేదని కావలి ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాలరెడ్డి బాధను వ్యక్తం చేశారు. నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మాట్లాడుతూ వర్షాలొచ్చినా, ఎండలొచ్చినా టౌన్‌లో నీటికి కరవేనని, ఈ సమస్యకు నెల్లూరు చెరువులో కాంప్రహెన్సివ్ స్కీమ్ నిర్మాణమే పరిష్కార మార్గమన్నారు.

రాపూరు ఎమ్మెల్యే రామనారాయణరెడ్డి మాట్లాడుతూ కరవు నిధులను నీరు - మీరు కార్యక్రమానికి మళ్లించారని, పొక్లయిన్ల ద్వారా పనులు చేయించారని ఆరోపించారు. సేవ్‌ది క్రాప్ నిధులు ఎప్పుడిస్తారన్న ప్రశ్నలకు అధికారులు సమాధానం చెప్పలేక పోయారు. సర్వేపల్లి ఎమ్మెల్యే చంద్రమోహన్‌రెడ్డి రొయ్యల రైతులు పర్యావరణ విఘాతకులని సభలో రుసరుసలాడారు.



మునిసిపల్ వాటర్ వర్క్స్ విభాగంలో మరమ్మత్తు పనులు పరిశీలిస్తున్న ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, వైస్ ఛైర్మన్ సందాని బాషా, మధ్యలో కౌన్సిలర్ షఫీ, చివరన కమీషనర్ వేమారెడ్డి వున్నారు.

---

## ఏది దారి?

4వ పేజీ తరువాత

సెకండరీ గ్రేడ్, బాషా పండితుల అర్హతలు గల 7వేల మందిలో, 6వేల మందికిపైగా నిరుద్యోగ ఉపాధ్యాయులు ఈ పోస్టుల కోసం పరీక్షలు వ్రాశారు. 29తేది ఈ పరీక్షా ఫలితాలు వెలువడినా, 857 మందికి పోస్టింగులు ఎక్కడిస్తారన్న విషయం ప్రశ్నార్థకంగా మారింది. రేషనలైజేషన్‌లోనే జిల్లాలో ఇప్పటి వరకు ఖాళీగా వున్న పోస్టులు భర్తీ అయిపోతే; భవిష్యత్తులో ఏర్పడబోయే ఖాళీల్లో కొత్తగా ఎంపికయ్యే నిరుద్యోగులను భర్తీ చేస్తారా.... లేకుంటే గాలిలో పెడతారా అన్నది ప్రశ్నార్థకమే!

---

## చిత్రసమీక్ష

9వ పేజీ తరువాత

కల్పించారు. పరుచూరి బ్రదర్స్ మాటలు కూడా సన్నివేశాలకు సహజమైన శక్తిని కూర్చాయి. రామన్న చౌదరి కనిపించినప్పుడంతా మణిశర్మ సమయస్ఫూర్తితో నేపథ్య సంగీతం కూర్చాడు. పాటలన్నీ వినతగ్గవిగావున్నాయి. సాంకేతిక విలువలన్నీ రామన్నచౌదరి పాత్రమీద కేంద్రీకరించినట్లే. జయరాం ఫోటోగ్రఫీ కూడా ఆ పాత్రను బాగా ఎలివేట్ చేసి చూపింది.

రామన్నచౌదరి భార్యగా జయసుధ, స్నేహితుడిగా చంద్రమోహన్, పెద్ద కుమారుడుగా మోహన్‌బాబు (రెండో పాత్ర), రెండో కుమారుడు అచ్యుత్, పెద్ద కుమారుడి ప్రియురాలిగా ప్రియాగిల్ వారికున్న పరిధిలో నటించారు. రామన్న చౌదరి ప్రత్యర్థిగా జయప్రకాష్‌రెడ్డి నటన బాగుంది. జటాధర స్వామి పాత్ర ఎంత చిన్నదో అందులో అంత పెద్దగా కనిపించాడు నెపోలియన్.

రాయలసీమ అనగానే కక్షలు, హత్య లు గుర్తుకొస్తాయి. ఆ దుర్మార్గాలకు మారుపేరుగా నిలుస్తాడు రాయలసీమ రామన్నచౌదరి. ఇంట్లో అందరూ ఆస్తికు లుగా వున్నా ఇతను పరమ నాస్తికుడుగా ప్రవర్తిస్తాడు. అది ఎవరిదైనా కాని తాను కోరిన భూమిని దౌర్జన్యంగా తన సొంతం చేసుకునే నియంతగా వ్యవహరిస్తాడు. తన ప్రత్యర్థిగా వున్న సాంబశివరావు (జయప్రకాష్ రెడ్డి) భూమిని ఆక్రమిం చదలుస్తాడు. అది తెలిసిన సాంబశివ రావు తన భూమిని తన ఊరి దేవాల యానికి వ్రాసేస్తాడు. తన ఊరికి రోడ్డువేసే ప్రయత్నం చేసి అందుకు దేవాలయం అడ్డుగా వుందని దాన్ని పడగొట్టించదలుస్తాడు రామన్న చౌదరి. తన ఇంటి ఆవరణంలో వున్న శివలింగాన్ని రామన్నచౌదరి తొలగిస్తే, దేవాలయం పడగొట్టేందుకు అంగీకరి స్తామంటాడు సాంబశివరావు. శివలిం గాన్ని పెకిలించి చెరువులో పారేస్తాడు చౌదరి అందరూ వద్దంటున్నా. రామన్న చౌదరి వంశం సర్వనాశనమవుతుందని జటాధరస్వామి (నెపోలియన్) చెప్తాడు. చౌదరిలోని నాస్తికత్వం అంతరించి పోతుంది.

నమ్మి కథ ఇచ్చినందుకు రజనీకాంత్ పరువు నిలిపి తన విశిష్టతను చాటుకున్నాడు మోహన్‌బాబు. చిత్రం చూడతగింది.

---

## సినిమా

9వ పేజీ తరువాత

చిత్రంలో హీరోయిన్‌గా ప్రత్యక్షమయ్యింది. గడచిన రెండేళ్లు బ్యాడ్ టైమ్‌గా భావిస్తాను. నిర్మాతలు ఛాన్స్ ఇస్తే మళ్లి వరిసగా చిత్రాల్లో నటిస్తానంటుంది.*

Registered : RN 1156 / 57
No. A.P. / VJA / 52 / 8 / 2000


# ఆధ్యాత్మికవనంలో టిఎస్ఆర్ జన్మదిన వేడుకలు!

ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్క రంగంలో రాణింపునకు రావడం లోకసహజం. కాని నెల్లూరీయుడు తిక్కవరపు సుబ్బరామిరెడ్డి బహుముఖ ప్రజ్ఞాశాలి. అన్నింటికంటే మించి రాజకీయ రాగద్వేషాలకు అతీతంగా అందరితో కలసిపోయే స్నేహశీలి. అందుకనే ఆయనకు దేశంలోని వివిధ రంగాలలో సుప్రసిద్ధులతో సత్సంబంధాలు నెలకొన్నాయి. వారందరికీ ఆప్తుడయ్యాడు. రాజకీయం, సినిమా, కళాసేవ, వ్యాపారం, పరిశ్రమలు, పబ్లిక్ రిలేషన్ల వంటి విభిన్న రంగాల్లో; ఒకదానికి మరొకటి పొంతనలేని వ్యాపకాలలో నిమగ్నులై వుంటారాయన. దీనివల్లే తరచుగా వార్తల్లోకెక్కుతుంటారు టిఎస్సార్.

సెప్టెంబర్ 17తేది విశాఖలో పండుగ వాతావరణం నెలకొనింది. కారణం ఆ రోజు సుబ్బరామిరెడ్డి జన్మదినోత్సవం. ఆయనకు జన్మదినోత్సవ శుభాంక్షలు చెప్పను వచ్చిన అన్నివర్గాల ప్రజలతో టిఎస్సార్ ఇల్లున్న రోడ్డంతా బ్లాక్ అయిపోయింది. పోలీసులు కారులో వచ్చే వారిని రోడ్డు మొదట్లోనే దింపేశారు. ఇంత ప్రజాదరణవున్న సుబ్బరామిరెడ్డి మొన్న పార్లమెంట్ ఎన్నికల్లో ఎందుకు ఓడిపోయాడో అర్థంకాని ప్రశ్నేనవాలి.

ఈ సందర్భాన్ని పురస్కరించుకొని విశాఖపట్నం కళాక్షేత్రంలో సాయంత్రం ప్రత్యేకంగా సభ జరిగింది. ఈ సభలో సుబ్బరామిరెడ్డిని ఆశీర్వదించను పీఠాధిపతులంతా తరలివచ్చారు. పుష్పగిరి పీఠాధిపతి, విశ్వంజీ యోగి, సూర్య పీఠాధిపతి సద్గురు కృష్ణయాజి, కాకినాడ భారత యజ్ఞ పీఠాధిపతి స్వామి, తిరుమల తిరుపతి దేవస్థానం ప్రధాన అర్చకులు రావడంతో సుబ్బరామిరెడ్డి జన్మదినోత్సవ సభ, ఆధ్యాత్మిక సభలా మారిపోయింది.

ఈ సభలో సుబ్బరామిరెడ్డి మాట్లాడుతూ నా పుట్టిన రోజు విశాఖపట్నాన్ని ఒక ఆధ్యాత్మిక పట్టణంగా చూడాలని అనుకొన్నాను. పీఠాధిపతులతో, వేదపండితులతో విశాఖ ప్రజలను దైవభక్తి పారవశ్యంలో చూడాలనుకొన్నాను. పూర్వకాలంలో రాజులు మహా రుషులను ఆహ్వానించి.. మీరు వచ్చి మా నగరాన్ని పావనం చేయమనేవారు. మహర్షులు పాదం మోపిన చోట ప్రజలకు సుఖ శాంతులు కలుగుతాయని అంటారు. అటువంటి ఉద్దేశ్యంతో నా జన్మదినోత్సవం రోజు పీఠాధిపతులు, మహావేద వేదాంగ పండితులను పిలిచి సత్కరించదలిచానన్నారాయన.

సుబ్బరామిరెడ్డి చెప్పినట్లు ఆయన జన్మదినోత్సవ సభ భక్తి పారవశ్యంలో మునిగిపోయింది. పుష్పగిరి పీఠాధిపతి మాట్లాడుతూ నేటి రాకెట్ యుగంలో పరుగులు తీస్తున్న ప్రజలకు కాస్త మనశ్శాంతి వుండాలి. ఆ మన శ్శాంతి కొంతలో కొంత ఆధ్యాత్మిక చింతనలోనే దొరుకుతుంది. అటువంటి ఆధ్యాత్మిక మధురఫలాలు ప్రజలకు పంచిపెడుతున్న సుబ్బరామిరెడ్డి జీవితం ధన్యమైనదని ఆశీర్వదించారు. విశ్వంజీ యోగి మాట్లాడుతూ మానవత్వం నిలువెల్లా మూర్తీభవించిన వ్యక్తి సుబ్బరామిరెడ్డి అని చెప్పారు. సుబ్బరామిరెడ్డి బ్రహ్మవిద్యను అభ్యసించిన కర్మయోగి; సామాన్యునిగా కనిపించే సుబ్బరామిరెడ్డిలో యోగ శక్తి దాగివుందని సూర్య పీఠాధిపతి కృష్ణయాజి అన్నారు.

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డాక్టర్ సి. నారాయణరెడ్డి మాట్లాడుతూ తనను తాను తెలుసుకొన్నవాడు తత్వజ్ఞుడు. ఇతరులను తెలుసుకొన్నవాడు పరమజ్ఞుడు. తనను తాను తెలుసుకొని ఇతరుల అవసరాలను తెలుసుకొని ధారాళంగా దానాలు చేసే మహామనిషి సుబ్బరామిరెడ్డి అని శ్లాఘించారు. బెస్టు పార్లమెంటేరియన్ జైపాల్‌రెడ్డి మాట్లాడుతూ సుబ్బరామిరెడ్డి వంటి విశాల హృదయం మానవుల్లో అరుదుగా వుంటుందన్నారు. మాజీ కేంద్ర మంత్రి జి. వెంకటస్వామి మాట్లాడుతూ దేశంలోని ధనవంతులంతా దానధర్మాలు చేస్తే ఈ దేశంలోనే పేదరికమే కనపడకుండా పోతుందన్నారు. సినీ రచయిత పరుచూరి వెంకటేశ్వరరావు మాట్లాడుతూ సంపన్నుల జన్మదినోత్సవమంటే స్టార్‌హోటల్స్‌లో సీసాలు, గాజు గ్లాసుల గలగలలతో మార్మోగుతాయి. కాని టిఎస్సార్ జన్మదినోత్సవం వేద ఘోషలతో మార్మోగుతున్నాదన్నారు. ఎమ్మెల్యే బాబుమోహన్ తన సహజ ధోరణిలో మాట్లాడుతూ ఇవ్వడమేగాని పుచ్చుకోవడం తెలియని గొప్ప వ్యక్తి సుబ్బరామిరెడ్డి అని అన్నారు. జన్మదినోత్సవ సందేశాన్ని పంపిన


జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని తిక్కవరపు సుబ్బరామిరెడ్డిని ఆశీర్వదిస్తున్న విశ్వంజీయోగి, వెంకటస్వామి, సినారె, తిరుమల దేవస్థానం ప్రధాన అర్చకుడు, పుష్పగిరి పీఠాధిపతిని చూడొచ్చు.

తరువ 7వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 091-861-327354, Offset Printing at Zaminryot Press, Nellore.